పంచతంత్రం



# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



యమునా తీరాన
నొకమర్రి చెట్టుపై
కాకమిధున మ్మొకటి
కాపురమ్ముండేది



చెట్టు కిందనె పుట్ట -
పుట్ట లోపల తాచు -
దినదినము గూటిలో
గుడ్లు తిని పోయేది



ఎన్ని గుడ్లో యిట్లు
నష్టమై పోగాను
కాకి దంపతులెంతో
కలవర మ్మొందాయి!



ఒకనాడు మగకాకి
ఏమేమొ యోచించి



కడకు తన మిత్రుడౌ
జంబుకము కడకేగి
సలహాను అడిగింది



బలముగల శత్రువును
పూర్వమొక ఎండ్రి వలె
బుద్ధిబలమున నెగ్గి
కృతకృత్యుడవు గమ్ము,






బదరికా వనమందు
ఒక కొలను గలదందు
ముసలి కొక్కెర యొకటి
మెల్లగా చేరింది



"స్వామి! ఈ తపమేల?"
అని అడిగె నొక ఎండ్రి



"పూర్వ పాపములెల్ల - పోద్రోలగా నేను
తపమే నర్చుచునుంటి!"




కొన్నాళ్లు గడువగా
కొంగపై చేపలకు
నమ్మకము పెరిగింది
స్నేహమ్ము కుదిరింది

ఒకనాడు మన బకము
జొటజొటా కన్నీరు
కార్చుచుండగ చూచి




"నేడొ రేపో మిమ్ము
వలవేసి పట్టుటకు
జాలరులు వత్తురని
విన్నాను మిత్రమా!!"




"దూరాన వేరొక్క,
చక్కని తటాకాన
మిమ్మెల్లగొని చేర్తు



ఒక్కొక్క చేపనే
ముక్కుతో కరుచుకొని
దూరాన కొండపై
భక్షించె నాకొంగ

ఎండ్రకాయను గూడ
గొంపోవుచుండగా
నీచువాసన తోచ
కొంగమోసము తెలిసి

"ముక్కునుంటె నాకు
వూపిరాడుటలేదు,
నీకంధమును కౌగ
లించుకోనిమ్ము!"



సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 44
సంచిక 45
**16-7-52**

నందన ఆషాఢ బహుళ దశమి బుధవారము


**లేపాక్షి వీరభద్రస్వామి దేవాలయంలో కళ్యాణమండపం. ఈ మండపం నిర్మాణం అసంపూర్తిగా ఉండిపోయింది.**

వ్యాఖ్యలు; విమర్శలు :

# పార్లమెంట్‌లో భాషారాష్ట్ర ప్రసక్తి



రష్యాకు భారత రాయబారిగా నియమితులైన శ్రీ కె. పి. యస్. మీనన్.

ఆంధ్రరాష్ట్రం విషయం ఎప్పటి మాదిరిగానే ఎటూ తేలకుండా ఉండిపోయినప్పటికీ, భారతదేశ దక్షిణ ప్రాంత భవిష్యత్తునుగురించి కేంద్ర ప్రభుత్వమూ కాంగ్రెస్ అధిష్ఠాన వర్గాల అభిప్రాయం పార్లమెంటులో స్పష్టంగా తేలిపోయింది.

## విషయానుక్రమణిక



భారతదేశాన్ని భాషాభేదాలను బట్టి రాష్ట్రాలుగా పునర్విభజించాలనీ, ప్రాంతీయభాషలనుబట్టి అవసరమైనచోట్ల రాష్ట్రాలసరిహద్దులను సరిదిద్దాలనీ, కమ్యూనిస్టు సభ్యుడు శ్రీ తుషార్ ఛటర్జీ ప్రవేశపెట్టిన అనధికార తీర్మానం పార్లమెంటులో జూలై 7 సోమవారంనాడు చర్చకు వచ్చినప్పుడు, కాంగ్రెస్ పార్టీ తీర్మానాన్ని ప్రతిఘటించింది ప్రధాని పండిట్ నెహ్రూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణంపట్ల తిరిగి సుముఖత ప్రకటిస్తూ, రాష్ట్రవిభజన వివరాలనుగురించి ఆంధ్రులు తమిళులతో ఒక ఒప్పందానికి రావడం ముందు అవసరమని చెప్పారు. అయితే హైదరాబాద్ రాజ్య విభజనకు గాని, దేశాన్నంతటినీ భాషా రాష్ట్రాలుగా పునర్విభజించడం గాని ఇప్పుడు కాంగ్రెస్‌కి సమ్మతంకాదని స్పష్టపరిచారు భాషారాష్ట్ర సూత్రానికి ఇప్పుడంగీకరిస్తే దక్షిణాపథం స్వరూపమే మారిపోగలదని నెహ్రూ అన్నారు భాషారాష్ట్ర విభజనవిధానానికి తానెన్నడూ—గత పాతిక సంవత్సరాల కాంగ్రెస్ వ్యవహారాలలోకూడా—వ్యక్తిగతంగా సమ్మతి ప్రకటించలేదని పండిట్ నెహ్రూ చెప్పారు

## హైదరాబాద్ ప్రకటన అంతర్యం

అంటే ఇంక ఆంధ్రులు, మహారాష్ట్రులు, కన్నడిగలు, కేరళులకు సంయుక్త భాషారాష్ట్రాల నేర్పాటు చెయ్యడానికి కాంగ్రెస్ సమ్మతించదని స్పష్టపడుతున్నది. దక్షిణాపథంలో భాషారాష్ట్రా లేర్పడితే ఆ రాష్ట్రాలు హిందీ భాషను జాతీయభాషగా పరిపాలనా వ్యాసంగానికిగాని శాసనసభా వ్యవహారాలకి గాని వినియోగించబోరని ముందే చెప్పవచ్చును అసలు భాషారాష్ట్రసిద్ధాంతానికి ఇదే మూలసూత్రం. పరిపాలనా యంత్రాంగం ప్రజలకు సన్నిహితంగా ఉండాలంటే భాషారాష్ట్ర సిద్ధాంతాన్ని అంగీకరించక తప్పదు. అయితే నెహ్రూ ప్రకటనలను పరిశీలించినట్లయితే దేశైక్యతాభావం ప్రాంతీయభాషాభిమానాలకంటె బలపడేవరకూ భాషారాష్ట్రాలను సృష్టించబోరని తోచకమానదు. ఈనాడు ఇంగ్లీషుభాష ఏవిధంగా పరిపాలనావ్యాసంగానికీ, శాసనసభా వ్యవహారాలకీ, విద్యాబోధనకీ ఉపయోగపడుతున్నదో, హిందీభాష ఆవిధంగా ఉపయోగించబడేవరకూ, హిందీభాష దక్షిణాపథంలో ప్రధాన జాతీయభాషగా బలపడేవరకూ దక్షిణాన భాషారాష్ట్రాలనేర్పరచడానికి కాంగ్రెస్ సమ్మతించకపోవచ్చును.

అంటే రాజ్యాంగపత్రంలో సూచించబడిన వ్యవధి పదిహేను సంవత్సరాలవరకూ భాషారాష్ట్రాల విషయాన్ని గురించి కాంగ్రెస్ ఆలోచించదన్నమాట.



శ్రీ కవికొండల వెంకట్రావు గారు. వీరి షష్టిపూర్తి మహోత్సవం జూలై 17 మొదలు 20 వరకూ జరుతున్నది.

దక్షిణాపథంలో ప్రాంతీయభాషాభిమానాన్ని జయించి, ఇంగ్లీషుభాషను మరిపింప చేసి ఇంగ్లీషుకంటె మిన్నగా హిందీభాషను స్థిరపరచడంకోసం భారతప్రభుత్వం తీవ్ర



కీ. శే. శ్రీ శ. పైడారావుగారు. కథకులు. వయస్సు 28 సం. లు. క్షయవ్యాధిపీడితులై 25 6-52 తేదీ నిదివంగతులైనారు. వీరి రచనలు మా పాఠకులకు పరిచితాలే.

కృషి చెయ్యడానికి సంకల్పించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని భారత ప్రభుత్వం అధీనం చేసుకుని హిందీ విశ్వవిద్యాలయంగా నిర్వహించాలన్న నిర్ణయం ఈ కృషిలో మొదటి మెట్టు జాతీయభావనూ, దేశైక్యతాభావాన్నీ సుస్థిరపరచడంకోసం ఉస్మానియా విశ్వవిద్యాలయంద్వారా నిర్బంధ హిందీ విద్యావ్యాప్తి జరుగుతుందన్నమాట ఇందుకోసమే హైదరాబాద్ సంస్థానాన్ని విభజించబోరన్నమాట హైదరాబాద్, బొంబాయి, మద్రాసురాష్ట్రాలను విభజించనంత కాలమూ దక్షిణాపథంలో సమగ్రమైన భాషారాష్ట్రాలు-అనగా విశాలాంధ్ర, సంయుక్తకర్ణాటరాజ్యము, సంయుక్త మహారాష్ట్ర రాజ్యమూ, సంయుక్త కేరళరాష్ట్రమూ ఏర్పడవు. నూరింట తొంభైమంది ఆంధ్రులు కోరుతున్నందువల్ల ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించినప్పటికీ, హైదరాబాద్‌ను విభజించకుండా ఉంటే సమగ్రమైన భాషారాష్ట్రాలకు అవకాశం ఉండదు.

హైదరాబాద్‌ను విభజిస్తే చాలు దక్షిణాపథం స్వరూపమంతా పూర్తిగా మారిపోతుందని నెహ్రూ అన్నారు. ఇప్పుడిప్పుడే ఈవిధంగా స్వరూపం మారిపోవడం నెహ్రూకి గాని కాంగ్రెస్ అధిష్ఠానవర్గానికి గాని ఇష్టం లేదు. జాతీయైక్యతాభావం పెంపొంది హిందీభాష దక్షిణాపథంలో స్థిరపడేవరకూ సమగ్రమైన భాషారాష్ట్రాల నిర్మాణంగురించి యోచనైనా జరగదు. అంటే రాజ్యాంగంలో సూచించబడిన వ్యవధిప్రకారం 1965 వరకూ భాషారాష్ట్రాల మాట తలపెట్టబోరన్నమాట ఈలోగా ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించడానికి నెహ్రూ (కొన్ని షరతులకు లోబడి) సుముఖత ప్రకటిస్తున్నారంటే, ఇది భాషారాష్ట్ర సిద్ధాంతం ప్రకారం కాదని ఎప్పటికప్పుడు తెలుస్తూనే వుంది

[11-7-52]



# విజయదశమికి ప్రత్యేక సంచిక

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక రాబోయే విజయదశమికి (సెప్టెంబరు 28) పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. బాలబాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలతో, పాటలతో, వ్యాసాలతో, బొమ్మలతో ఆకర్షణీయంగా తయారవుతుంది. రచనలు పంపగోరువారు ఆగస్టు నెలాఖరులోగా మా కార్యాలయానికి అందేలాగ పంపాలి.

పిల్లలరచనా శక్తిని, చిత్రలేఖనశక్తిని ప్రోత్సహించే ఉద్దేశ్యంతో పోటీ కూడా ప్రవేశపెట్టదలచాము. పదిహేనేళ్లలోపు బాలబాలికలుమాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. పోటీకివచ్చినవాటిలో ఒక మంచికథకు, ఒక మంచిపాటకు, ఒక మంచి బొమ్మకు బహుమతులివ్వబడతాయి. రచనలు స్వతంత్రంగా ఉండాలి. రచయితలు తమవయస్సు, చిరునామా వివరంగా రాయాలి. రచనపోటీకొరకైతే 'పోటీకొరకు' అని, మామూలు ప్రచురణకయితే 'మామూలు ప్రచురణకు' అని స్పష్టంగా రాయాలి.

—సంపాదకుడు

# పాథము

# సుగుణ

'హల్లో కృష్ణా! ఎక్కడికి రా పోతున్నావు? రా కాఫీ తీసుకుందాము.'

'సరే నడు, నువ్వు కనిపిస్తావా కని పించవా అనుకుంటున్నాను. అసలు బయలుదేరడం కూడా నీ కోసమే!'

మే మిరువురం కలసివెళ్లాము. కృష్ణుడు అరవవాడి టేబిల్ మీది న్యూసు పేపరు తీసుకుని అతి డీప్‌గా చదవడం ప్రారంభించాడు అల్లా దింపిన తలఎత్తకుండా ఏం చదువుతాడో వాడికే తెలియదు—నా జన్మలో వాడు క్లాసు టెక్స్టులు అల్లా చదవడం చూడలేదు. ఆ చదువంతా ప్రక్కనున్న ఏ నాలాంటివాడు కాఫీకి ఆర్డరిచ్చేదాకానే. అంతటిదనుక అతి సీరియస్‌గా చదువుతూన్న పేపరు మొదటి పేజీ అప్రయత్నంగా తిరుగుతుంది ఆరవగుంటడు కాఫీ తీసుకురావడం చూచి గబగబా సినిమారీల్సు కుల్లే నడుస్తాయి-వాడి కదోదురలవాటనుకుంటా ఆ కుఱ్ఱడు టేబిల్ మీద కప్పులు పెట్టేసరికి ఎలక్ట్రిక్ స్విచ్చి నొక్కితే దీపం ఎలా ఆరుతుందల్లాగో పేపరు మడతపడి ప్రక్కనున్న టేబిల్ మీదో లేక ఛైర్ మీదో విశ్రమిస్తుంది

ఇక అక్కణ్నుంచి మా కృష్ణుడు-తాను జవహరో, కృప్లానీయో, లేక సి. ఆర్. అనుకుని దేశపరిస్థితి, దాని విముక్తిని గురించి ప్రస్తుత రాజకీయాలని గూర్చి ఎవరూ ప్రార్థించకుండానే, లెక్చరిస్తాడు. మఱి ఆ కాఫీనీళ్ళ దనుకుంటాను ఆ శక్తి అంతాను మీసాలు కొఱుకుతూన్నా సరే, దాంట్లోంచి ఆవిరులు వస్తూన్నా

కాని మావాడు తెనాలి రామలింగడి పిల్లి గతైనాసరే, నాకంటె ముందుగా తాగేసి అయ్యరు దగ్గఱకు వెడతాడు.

అమ్మయ్యా! నేను వేసుకువచ్చిన పావలా డబ్బులూ దక్కాయి! నేను మా అమ్మని ఉబ్బేసి, బ్రతిమాలి ప్రాణం పోగొట్టుకున్న స్థితిదాకా వచ్చి సంపాదించుకున్న ఈ పావలాతో ఏదో కాఫీ త్రాగి ధూమపానం చేసుకుందామనుకున్నాను ఈ పావలా డబ్బులూ మిగులుతాయి, మావాడు ముడుపు చెల్లించే మాటైతే, యింకొకసారి ఒంటరిగావచ్చి తాగొచ్చు అని సంతోషం పొందాను. ఇంతలో మావాడు పేపరు యిచ్చేసి ఏదో పెద్దపనిఉన్నవాడిలా, వీధులో నడచిపోతూన్న స్నేహితుణ్ణి ఉద్దేశించి వెళ్లిపోయాడు. (ఆ స్నేహితుడు వీణ్ని సరిగ్గా ఎరుగకపోయినా సరే-వీడూ వాడూ నాల్గయిదుసార్లు తారసిల్లితే సరి, మావాడికి స్నేహితులైపోతారు.) మన పావలాకి మనకి ఋణం తీరిపోయిందిరా అని-విచారంగా ముడుపుచెల్లించి వచ్చేసరికి మా కృష్ణుడప్పుడే ఆ క్రొత్తస్నేహితుకి సిగరెట్టు ప్యాకెట్టులోనుంచి ఒకడి గ్రహించి-ధూమపానక్రియ అత్యంత భక్తితో చేస్తూ, వ్రేలితో నన్ను చూపిస్తూ, వెళ్లివస్తానండని చక్కా వచ్చాడు

వాడిపనే బాగుంది, ఆశక్తి నాక్కూడా ప్రసాదిస్తే, బాగుండునని రా అడిగేద్దామనుకున్నాను; ఇతరుల బుఱ్ఱమీద ఆముదము పులిమే శక్తి వాడికెల్లా వచ్చిందని. అది ఒక మహత్తరమైన శక్తి అంటే నమ్మండి క్రితం జన్మలో చేసిన పూజాఫలితము. చిన్నప్పట్నుంచి ఉగ్గపాలతో పుట్టుకురావాలిగాని యిప్పుడు క్రొత్తగా నేర్చుకుందామంటే వచ్చేది కాగు-అహా! రాక దొబ్బుడాయి. దానిమీద దృష్టి నిల్పి నేర్చుకుంటే అదే వస్తుంది, పారాలు రావడంలేదూ! ఇక మనంకూడా కృష్ణుడి పని ప్రారంభించాలి అంటే వెన్నగొంగిలించడం కాదు సుమండీ కాదు. వాళ్లతో స్నేహంగా ఉండి వాళ్ళని దుమ్ముచెయ్యడం నేర్చుకోవాలి. తప్పక తపస్సైనా చేసి నేర్చుకోవాలి ముమ్మాటికి నేర్చుకోవాలి ఇదే నిశ్చయం.

తలక్రిందులుగాను, ఒంటికాలి మీద, చన్నీళ్ళలోను, వేడినీళ్ళలోను, ఒకటేమిటి యిదివరలో మునులు దైవసందర్శనార్థమై ఎన్ని చిత్రవిచిత్రమైన వేషాలు వేశారో అన్నీ అములులోకి తీసుకవచ్చాను. కృష్ణుడు నా కళ్ళముందు అప్రత్యక్షమయ్యేవాడు కొంపతీసి నాపూజాఫలితంగా నిజంగట్టి కృష్ణపరమాత్ముడేనేమో. కాదు. కాదు. నా స్నేహితుడు కృష్ణుడే దుర్యోధనాదులు పాండవులమీద వేసిన పన్నాగా లెన్ని ఉన్నాయో వాటినన్నిటిని అవలంబించి వాణ్ని తప్పించుకునేసరికి చావు తప్పి కన్నులొట్టపోయినస్థితిలోకి వచ్చేవాణ్ని ఇక వాడి స్నేహం వదలి

వేయడమా లేక వాడి స్నేహం అభివృద్ధి చేసుకుని, వాడికి యీ ఫీల్డులో వచ్చిన రాజ్యాంగతంత్రాలన్నీ చెప్పించుకుని, వ్రాసుకుని, రుక్కుపట్టి, ఒప్పగించి ప్రాక్టికల్‌గా ఆ బ్రహ్మాస్త్రాన్ని యింకో కళ్ళమీద ప్రయోగించడమా? లేకపోతే, యిదే చెయ్యాలి వాడిదగ్గర ఆ విద్యలన్నీ నేర్చుకునేదాకా మా అమ్మ యిచ్చిన పావలాడబ్బులలోనూ వాడికి బేడా చెల్లించవలసిందేనా? అయినా పోనీలే ఏదో పదిరోజులకంటె వాడిదగ్గర నా శుశ్రూష ఉండదు పోతేపోతాయి నఘవ పదిబేడలు. అటుమీద యిటువంటి బేడలెన్ని మిగల్చగలనో కాని ఆ విద్య నేర్చుకున్న తర్వాత వాడిమీద ప్రయోగిస్తే కృష్ణుడికిమల్లే తప్పించుకు చక్కాపోతాడేమో? వాడి విద్యలో పరిపూర్తి అయ్యేసరికి వాడికీ నాకూ స్నేహం ప్రబలిపోతుంది ఇందాక అన్నాను చూశారూ - మా అమ్మ సరిగా యివ్వకపోతే - ఆకృష్ణావతారమే ఎత్తవలసివస్తుంది వెన్నముద్దలకి కాదు. డబ్బుసంచిలకే కన్నం భయం వేస్తోంది

పోనీలే, ఆ వెధవవిద్య నాకు ఒద్దు బాబూ! దాంట్లో బి యే, యమ్ యే డిగ్రీలనవసరం. ఏ స్కూలు ఫైనల్లో నాల్గుసార్లూ తప్పి, ఆంధ్రా మెట్రిక్‌కి కూర్చుందామన్న ఉద్దేశ్యముండి, దాన్ని చివరకు విఫలించుకున్న వాడికిమల్లే ఉంటాను నాకు ఒద్దునాయనా ఒద్దు అటువంటి చదువు దాన్నిగూర్చి ఆలోచిస్తూంటేనే తల తిరుగుతూంది. నాకే ఆశ్చర్యం. కృష్ణుడు ఎట్లా పట్టభద్రుడయ్యాడో! అల్లా ప్రప్రథముడుగా ఉత్తీర్ణుడవడానికి వాడికి ముందు సార్వీసెంతో? వాడికి కూడా నాకుమల్లేనే మొదటిరోజుల్లో పెద్దపెద్ద దెబ్బలు తగిలిఉంటాయి అయినా కాని నాకందుకు వాడిగోల. నాకు మాత్రం వద్దు నాయనా గొప్ప విద్య ఏదో యిల్లా ముక్కుమూసుకుని కాలక్షేపం చేస్తాను అనవసరపు విద్యలు నేర్చుకోవడం నలుగురిలో యిదివరలో నున్న గౌరవమంతా పోగొట్టుకోవడమున్నూ వెధవ, వాడికున్న గౌరవం చూస్తూనేవున్నాగా. , నలుగురిలోకి వెళ్ళేసరికి ఒక పాతగొంగళిలా తీసి పారవేస్తున్నారు ఎందుకొచ్చిన చిత్తక్షోభ. సుఖానున్న ప్రాణిని కష్టపెట్టుకోవడం తప్ప వీసంత లాభం ఉండదు నాదారిని నేను పోతాను

ఎవరు తీసుకున్న గోతిలో వారే పడతారన్నట్లు, ఈ కృష్ణుడి విద్యంతా నేర్చుకున్న తర్వాత నన్ను వదలరా బాబూ అంటే, నే కృష్ణున్ని నువ్వు అర్జునుడివి అంటూ, నెత్తిమీద శిలలా వదలిపెట్టకుండా శనిలా వదలిపెట్టక కూర్చున్నాడంటే చస్తాను. ఒద్దులే నాకొద్దు నాకున్న దాంట్లోనే కాలక్షేపం చేసుకుంటాను. ఇన్నిసార్లు నాతో కాఫీదేవాలయానికి వచ్చాడే, వెధవకి బుద్ధిఉండక్కర్లేదూ ఒక్కసారైనా యిప్పించాడా. అటువంటివాడిప్పించనక్కర్లేదు యిప్పిస్తానంటే అదే పదివేలుగా! ఈసారి వాడితో నిజంగా చెప్పేస్తాను ఆ దేముడికి తెలుసు డబ్బు సంపాదించడంలో నేను పడే కష్టాలు ఆ దేముడికైనా మచ్చికచేసి డబ్బు సంపాదించగలమేమో కాని, మా అమ్మదగ్గర అటువంటివి సాగవు. అట్టి మా అమ్మదగ్గర పీక నులిమితే నోట మాటరాక, ఉక్కిరిబిక్కిరై, కళ్లు తేలేసే స్థితికివచ్చి, చావుకి ఒక క్రిందు మెట్టు దర్శించి, చివరికి ప్రజ్ఞావంతుణ్నై సంపాదించుకునే పావలాలో వీడికి కక్కుర్తా? వెధవకి బుద్ధి చెప్తాను

రేపు డబ్బులులేకుండా నేను వెడతాను. వాడు రావడం సహజమేగా. సరే కాఫీ తాగుతాం. డబ్బు యిచ్చేటప్పుడు 'ఒరే నాదగ్గర డబ్బులు లేవు నువ్వు యివ్వరా అంటాను' డబ్బు ఉండి గౌరవంగా

(46-వ పేజీ చూడుడు)



"మీరు దానికార్హైనన మనిషిసార్!"

# ప్రశ్నలు - సమాధానాలు

బి జగ్గారావు—నాగులాపల్లి.

నవ్యసాహిత్యంలో కొన్ని గేయాలు, వచనాలు వ్రాసేటపుడు కొన్ని భావాలు రచయిత మెదడులో దాచుకొని వ్రాస్తే సామాన్య ప్రజానీకానికి ఎలా అర్థమవుతాయ్?

—అందరికీ అర్థమయేలాగ వ్రాస్తే అదీ ఒక సాహిత్యమేనా అని వారి అభిప్రాయమై ఉండవచ్చు.

*  *  *



యన్. వి. రమణ—కర్నూలు.

హిందూ కోడ్ బిల్లును ప్రవేశపెట్టుటవల్ల భారతమాతకే తీవ్రమైన అపకారము చేసిన వారమగుదుమని నా స్నేహితుని అభిప్రాయము పాశ్చాత్యుల కటువంటిది సరిపోవును కాని మనదేశములో ముఖ్యంగా మహిళాభ్యుదయానికే ఒక మచ్చ! మీ అభిప్రాయ మేమిటో తెలవిస్తారా?

—స్త్రీలకు ఇప్పుడేమీ అపకారం సంభవించటంలేదా? మచ్చవస్తే మనుష్యులవల్ల వస్తుందిగాని బిల్లులవల్లరాదు.

*  *  *

సయ్యాద్ షఫి—అమలాపురం.

తెలుగు చిత్రాలను హిందీలో డబ్ చేయడం మన తెలుగు నిర్మాతలకు తెలియదా? తెలిస్తే, సంసారం, పాతాళభైరవి, మొదలగు చిత్రాలను నిర్మాత వాసన్ నిర్మించడంలోగల కారణం తెలుపగలరా?

—హిందీలో విడుదల చెయ్యటంలోని సాధకబాధకాలను ముందు వాసన్‌లాంటివారికే వదిలేద్దా మనుకున్నారేమో మనవారు. ఇప్పుడు తెలుగు నిర్మాతలు కూడా హిందీ వెర్షనులు తీయటం ప్రారంభించారు.

*  *  *

ఆదూరి రాంబాబు—నరసాపురం

"మానవుణ్ని మానవుడిగా ఉంచుతుంది మాత్రమే 'కమ్యూనిజం', మానవుణ్ణి మానవాతీతుడిగా చేయగలుగుతుంది, భారతీయ సంస్కృతి" విధానం అని నావిశ్వాసం—ఆలోచించి ఏ విధానంలో ఉత్కృష్టతుందో చెప్పండి

—మీ నిర్వచనాలనుబట్టి, మానవులుగా మాత్రమే బ్రతకగోరేవారు కమ్యూనిజాన్ని, మానవాతీతులు కాగోరేవారు భారతీయ సంస్కృతిని వరిస్తారు!

*  *  *

శ్రీ సుందర్—గుంటూరు

శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారు కంట్రోళ్ళను తొలగించుటవలన లాభమా, నష్టమా?

—ఒకరికి లాభం మరొకరికి నష్టం.

రాజగోపాలాచారిగారు ఇంకా క్రొత్తపన్నులు విధిస్తున్నారు. ప్రస్తుతము రాయలసీమ ప్రజలు కరువు కాటకాలతో మలమల మాడుతుంటే ఈపన్నులు వారు ఎట్లా చెల్లించగలుగుదురు మహాశయా? అందులో ఈ అరిష్టకాలంలో ఈ పన్నులు వేయుటసబబు గాదని నా అభిప్రాయము. మీ అభిప్రాయమేమిటో సెలవియ్యాడి.

—పన్నుల విధింపుకి క్షామాలూ, వరదలూ అడ్డురావు అసలు క్షామ నివారణకి రు 6 కోట్లూ ఆ చేత్తో యిచ్చారు, ఈ చేత్తో తీసుకుంటున్నారు!

*  *  *

ఫీల్లానా అప్పారావు—విశాఖపట్టణం.

ప్రజా ప్రతినిధులు అసెంబ్లీ హాలులో నిద్రపోవచ్చునని మొన్న హైద్రాబాదు స్పీకరుగారు నుడివేరు ప్రజలకు సేవ చేస్తామని చెప్పి అసెంబ్లీ హాలులో పడుకొంటున్న ప్రజా ప్రతినిధులని ఏంచేస్తే బాగుంటుందండీ?

—అసెంబ్లీహాలులోనే పరుపులు ఏర్పాటుచేస్తే సరి.

మన రైలు కంపార్టుమెంటుల్లో ఆడవాళ్ళ పెట్టెల్లో మగవారు ఎక్కకూడదుగాని, మగవాళ్ల పెట్టెల్లో ఆడవాళ్లు ఎక్కవచ్చు-యిదేం న్యాయముండి-

—పదిమంది ఆడవాళ్ళమధ్య ఒక్క మగవాడు నిలవగలడా?

*  *  *

కనగాల రామారావు—పెదమోదుగపల్లి.

మానవుడు చిటికెలో ప్రపంచాన్ని నాశనము చేస్తాడు, ఆకాశాన ఎగురుతాడు, హింసలు పెడతాడు. కాని, తను జీవించేది ఎట్లాగో తెలియదు. మానవుడు జీవించుట ఎట్లాగ?

—కళ్లుమూసుకుని

*  *  *

హెచ్. శ్రీనివాసరావు—నెల్లూరు.

ఇతరపత్రికలవలె "అభిప్రాయప్రకటన మన జన్మహక్కు రాజ్యాంగం దానికి సంపూర్ణంగా అభయమిచ్చేంతవరకూ విశ్రమించము" అని మీరు, మీ పత్రికలలో వ్రాయకపోవుటలోని అంతరార్థ మేమిటండీ?

—మంత్రాలకు చింతకాయలు రాలిన రోజున, ప్రకటనలతో హక్కులు ఊడిపడతాయి

"స్వర్గసీమ" "మల్లీశ్వరి"లలోని భానుమతికి, "లవ్"లోని భానుమతికి తేడా కన్పిస్తోందికదా! కారణమేమిటంటారు?

—బి. యన్. రెడ్డి, రామకృష్ణగార్ల దర్శకత్వంలోని తేడాలే భానుమతిలోనూ కనిపిస్తాయి.

*   *   *

కె సీతారామమ్మ—కోటగిరి.

ఆధునికాంధ్ర సాహిత్యానికి ఏకైక నాయకు డెవ్వరు?

—సాహిత్యంలోనే కాదు ఏవిషయం లోనూ ఆంధ్రులకు ఏకైక నాయకులు లేరు అదే మన ప్రత్యేకత.

"గురజాడకే టాగూరుకీ హస్తిమశకాంతర మున్నది; టాగూరు కవి కాదు; గురజాడ గొప్పకవి" అన్న శ్రీ శ్రీ ఉద్దేశంతో మీరేకీభవించగలరా?

—బహుశా శ్రీ శ్రీ గారు "స్రరియలిస్టు మూడ్"లో ఉన్నప్పుడు ఈమాట అన్నారేమో.

*   *   *

శ్రీపతి మాధవరావు—తెనాలి

ఒక చిత్రంయొక్క జయాపజయాలు ముఖ్యంగా ఎవరిమీద ఆధారపడి ఉంటవి? చిత్రం విజయవంతమైతే న్యాయప్రకారంగా కీర్తి ఎవరికి దక్కాలి?

—చిత్రం జయాపజయాలు ప్రేక్షకాధీనం. చిత్రనిర్మాణంలో పాల్గొన్న నిర్మాతనుండి కింది ఉద్యోగివరకూ కీర్తిగాని అపకీర్తిగాని చెందవలసినదే.

అనుకరణ లేకుండా సంగీత దర్శకత్వము నిర్వహించేవారు కంచుకాగడా పెట్టి వెదకినా మనదేశములో కనపడరని ఒక సినిమా మాసపత్రిక జవాబిచ్చింది ఇది ఎంతవరకు నిజం?

—సృజనాత్మకంగా (*Creative*) అనుకరిస్తే అనుకరణ అనిపించుకోదు. అలా అనుకరించేవారు మనదేశంలో చాలమంది ఉన్నారు.

*   *   *

టి. రామమోహనరావు—తాడంకి

కొందరు డైరెక్టర్లు తమ చిత్రాల్లో అనవసర సన్నివేశాలను సృష్టించి ఫిల్ము పొడుగు పెంచుతారు. కారణమేమంటారు?

—పొడుగును బాగా సాగదీస్తేగాని ఫిలిము ప్రజల్ని చేరుకోలేదని వారి ఉద్దేశ్యమేమో?

*   *   *

డి వీరభద్రరావు—తాడేపల్లి గూడెం

మార్క్ ట్వేన్ వ్రాసిన "రాజూ-పేదా" అనే నవలను చిత్రంగా నిర్మిస్తున్నారని చదివాం అది ఎంతవరకు నిజం? నటీనటు లెవరు? చిత్రం ఎంతవరకు వచ్చింది?

—బి. ఏ. సుబ్బారావుగారు "రాజూ-పేదా" చిత్రం నిర్మించ సంకల్పించటం వరకూ నిజం. రాజు, పేదపాత్రలకు ఇద్దరు కవలపిల్లలు, పేద బాలుడి తల్లిగా లక్ష్మిరాజ్యం, ఇంకెవ రెవరో కొత్తవారు బుక్ అయ్యారు. నిర్మాణం ఇంకా మొదలు కాలేదు.

*   *   *

ఎస్ ఎస్ వీరేశం—సికిందరాబాదు.

మీయొక్క ఆంధ్రపత్రిక పైన, పైకవరున సినిమాతారల చిత్రాలు వేయుటకు ముఖ్యకారణము తెలియజేసేది.

—ఈ ప్రశ్నకు ఎన్ని మార్కులు వేస్తరుగారూ?

*   *   *

వంగల రంగనాయకమ్మ—చల్లపల్లి

సాహిత్యం పతితస్థితిలో వుంటే, దేశం పతనం చెందుతుందంటారు కాని ఆధునిక యుగవాదం ఏమంటే, విజ్ఞానశాస్త్రంలో నైపుణ్యంలేని దేశం వెనుకపడ్డదేశంగా పరిగణిస్తారు. కాబట్టి సాహిత్యానికి సైన్సుకుగల సంబంధమేమిటి?

—అవినాభావ సంబంధం.

సంఘమేర్పరచిన నీతి నియమాలు పురుషులకన్నా, స్త్రీలకు అతి కఠోరంగా ఎందుకుంటాయి?

—నీతినియమాలు ఏర్పరచింది పురుషులు కనక.

*   *   *

ఎమ్. పురుషోత్తం—తోరనగల్లు.

శ్రీ వి. నాగయ్యగారు ప్రథమంగా నటించిన తెలుగు అరవచిత్రము లేవండీ? వారు స్వంతముగా దర్శకత్వముచేసిన చిత్రమేది?

—తెలుగుచిత్రం "గృహలక్ష్మి", అరవ చిత్రం "అశోక్ కుమార్"; డైరెక్టుచేసిన చిత్రం "త్యాగయ్య".

ప్రేమకు, కామమునకుగల దూరమెంత మహాశయా?

—ప్లేటోకు, ఫ్రాయిడ్‌కు మధ్యఉన్న దూరమే

కలకు, కళకుగల కనిష్టవ్యత్యాసము?

—కల ఒక్కరికే, కళ అందరికీ

*   *   *

బి కృష్ణారెడ్డి—నెల్లూరు.

సెక్సు విజ్ఞానంపై ఫిలిములు మన ప్రభుత్వమువారు తీసి ఎందుకు ప్రచారము చేయగూడదండీ?

—ప్రేక్షకులు సెక్సులో ఎక్కువ అర్థం తీస్తారనే భయంచేత!

*   *   *

కొమ్మూరి పూర్ణచంద్రరావు—తెనాలి.

తెలుగునటుడు ఎ. నాగేశ్వరరావు అన్నపూర్ణాఫిలింస్ ద్వారా తీయబోయే పిక్చరు పేరేమిటి? దానికి డైరెక్టరెవరు? దానిలో హీరోయిన్ పాత్ర ధరించేదెవరో తెలియజేస్తారా?

—పిక్చరుకు ఇంకా పేరుపెట్టలేదు. బహుశా కె వి రెడ్డిగారు డైరెక్టు చేస్తారు. హీరోయిన్ ఇంకా నిర్ణయం కాలేదట.

*   *   *

బి. అప్పారావు—విశాఖపట్టణం.

తెలుగు సినీమారంగంలో మీరు ఉత్తమ నటి, నటుని ప్రస్తుతము యెవరిని యెన్నుకుంటారు?

—ప్రజాస్వామిక దేశాల్లో ఎన్నికలు రహస్యబాలట్ పద్ధతిమీద జరుగుతాయి. మీరు మాకు ఈ ప్రాథమిక హక్కును నిరాకరించదలచారా?

సురభి బాలసరస్వతి ప్రస్తుతం యేమి చేయుచున్నది?

—ప్రసాద్ ఆర్టుపిక్చర్సువారి మొదటి చిత్రంలో నటిస్తున్నది. ★

# బూచి

తొలికోడి కూసింది. మందమారుతాలకి ఆ పూరిగుడిసెమీది ఆకులు అప్పుడప్పుడు 'టపటప' మని కొట్టుకుంటున్నాయి. చంద్రకాంతి ప్రశాంతవాతావరణానికి దోహదమిస్తోంది. గుడిసెలో వెలుగు లేదు. కాని కప్పుఆకుల సందుల్లోంచి గుడిసెలో వెన్నెలవెలుగులు పడుతున్నాయి నులకమంచంమీద పడుకున్న 'జగ్గులు' దుప్పటిముసుగులో ఓ దగ్గు దగ్గి లేచికూర్చున్నాడు చలిగానే వుంది రాత్రి వాళ్ళు పెట్టుకున్న కుమ్మకుంపటిలో నిప్పుందేమోనని కెలికాడు. నిప్పెక్కడా లేదు. అగ్గిపెట్టెకోసం వెదికాడు గూట్లో దొరికితే, పుల్లవేసి చుట్ట కాల్చుకుని 'అమ్మయ్యా' అన్నాడు. పక్కలో ఒత్తిగిలి పడుకున్న కొడుకు 'బూచి' ఊఁ అంటూ తిరిగి దీర్ఘనిశ్వాసం విడిచాడు. 'ఎర్రి ఎదవ, చలి లేదూ, గిలి లేదూ-ఆపడంగానే తొంగుంటాడు' అంటూ జగ్గులు తను కప్పుకున్నది, వాడికి కూడా కప్పాడు. రెండోసారి 'కొక్కొరోకో' అని పుంజుకూత వినపడేటప్పటికి జగ్గులు గుండెలు 'దడదడ' లాడాయి తను చేయవలసిన పని గుర్తొచ్చింది. తెల్లారే ఎనిమిది గంటలలోగా ఊరంతా వూడవాలి, పంచాయితీ బోర్డు ప్రసిడెంటు ఇంటివద్ద ఎనిమిది గంట్లకు జగ్గులూ పెళ్లాం కనిపించకపోతే—ఇంకేముంది? శివాలు తొక్కయ్యడూ ప్రెసిడెంటు భూషణం? హుంకరించెయ్యడూ? అతను ఎనిమిదింటికి లేచినా అడిగేదెవ్వరూ? ఏదేనా వస్తే, అతడే సంఘశ్రేయోభిలాషి; లోకోపకారి ఇంక ఇట్టి మన్ననలకి అంతూ పొంతూ వుండదుకదా మరి!

జగ్గులు త్రుళ్ళిపడి లేచాడు. సంతజనం తినిపోసిన తుక్కుపోగులు, బజారు జనం పోసివెళ్ళిన చెత్తకుప్పలూ ఇంకా ఉమ్ములూ మొదలైనవి అతని మెదడులో సినిమాఫిలింలా కదలిపోయాయి అన్నీ ఎత్తాలి కాబోసు!

"ఓసేయి లెగులెగు. ఇంకా తొంగోడమే" అన్నాడు జగ్గులు గురకపెట్టి నిద్రపోయేదాన్ని తట్టి.

"లెగవేంటే ఓలప్పుడే రొండోకోడి కూసేసింది ఏంత పని సెయ్యాల్లో తెలుసా" అని మళ్ళీ అన్నాడు, సుఖనిద్రలో మునిగిన భార్యమీద చెయితకొట్టి.

"ఒప్పుడే కోడికూసిందా బద్దకమేనా తీరలోదు" అంది అస్పష్టంగా 'బాగి' ప్రక్కకు వత్తిగిలుతూ.

"ఒదిగో పక్కకు తిరిగి గురక లేత్తున్నావ్-లెగవేస, ఎన్నిసార్లు సొప్పాల" అన్నాడు ఇంకోసారి

"అబ్బ-బ్బ-బ్బ. కోసిపెడుతున్నావ్, కొంతసేపేనా తొంగోకుండా సలికొరుక్కుతింటూంటే" అంది బాగి లేచి కూర్చొని, తలకొప్పు ముడివేసుకుంటూ.

"సంతమార్కెట్టు తుడవొక్కర లేపెసెంటుగోరి పనిసెయ్యక్కరలే మరెల్లాగే తొంగుంటే?" అన్నాడు జగ్గులు.

"ఆ సంతపేట ఓసు తుళ్ళను బాబూ-పేణాలుపోతాయి, నిన్నొక్కపూటే గంజి తాగేను రాసిడేసితుక్కోత్తారు" అంది బాగి పిసుగ్గా. 'బాగి' దొక అమాయిక హృదయం. తనకు జ్ఞానమొచ్చింది మొదలు కష్టాలతో చెలగాట మాడటమే అది వాళ్ళకు నెప్పి అనిపించదు జగ్గులును పెళ్ళాడినతర్వాత ఓ కొడుకు పుట్టాడు 'బూచి' అంటే వాళ్ళిద్దరికి ప్రాణం. ఒక్కొక్కప్పుడు 'బాగి' మనస్సుకు తట్టుతోంటుంది "ఎందుకు ఈ పని చెయ్యాలి? ఎందుకూ తెల్లారకట్ల లేచి చలిగావున్నా పని కెళ్ళడం?" 'కూడు' అనే మాట జ్ఞాపకం రాగానే ఒక్కసారి చీపురుపుచ్చుకొని రోడ్డుమీదకి పరిగెత్తుతుంది.

మళ్ళీ ఈవేళకూడా మనస్సుకి కష్టమనిపించిందేమో! అడ్డదిడ్డంగా మాట్లాడ్డం మొదలుపెట్టింది. చాలీచాలని పయిటచెంగు లాక్కొని ముడిచిపెట్టుకు కూర్చుని బాధగా మొదలుపెట్టింది

"ఓరికేపట్టని బాద మనకట్టింది. తెల్లోరికట్టె లెగిసి ఊరంతా ఊడవాల. ఒవ్వరికి పట్టిందీ బాద! రెక్కలు ముక్కలయ్యేటట్టు సేసినా ఏ సామికేనా జాలా? 'కేర కేర'ని ఏడిసినా కొంత కూడేనా ఎయ్యరూ! రాసడేసితుక్కలు రెక్కమీద లాగాలి."

"ఏంసేత్తామే. మనం ఆ పని సెయ్యాల. లేకపోతే గంజికేదీ?" అన్నాడు జగ్గులు.

"నువ్వొప్పుడూ అల్లానే సొప్పుతావు-పపంచమంతా బారెడు పొద్దెక్కాక లెగిస్తే మనం కోడికూతకే లెగాల."

" .. . . .. "

"ఒవడు సేత్తాడు బాబూ యీ పని"

"పజల ఆరోగ్గంకోసం పనిసెయ్యాలట మనం. మొన్న మనూళ్ళో జరిగిన మీటింగులో సొప్పలే"

"ఒప్పుడూ "

"హే!-మనోళ్ళందరు సమ్మెసేయలే. ఒప్పుడూ "

"బాబో? ఎవరి ఆరోగ్గం ఎలావున్నా మన ఆరోగ్గంఎవరేనాసూసారూ-మొన్నా, నాలుగుమాత్రలు బుచ్చియ్యగా రిచ్చోరు కాని-దరమతండ్రి ఒవ్వరేనా ఇచ్చారూ"

"ఇంతకే పనిసెయ్యడం, మన 'ఇథి'-ఏంసేత్తాం ఈవేల నీకు మల్లీ ఎత్తుకొచ్చిందేంటి?"

"ఇథి ఆరోగ్గం - మన ఆరోగ్గంమాట ఓళ్ళేనా సూత్తున్నారా? ఇంత ఊరు సుబ్రంసేత్తాం కదా?"

"ఒవ్వడికట్టిందేంటే - ఎదవమాటలు-ముదురుమాటలు కాకపోతే నీయి? ఏ - హే - నీతో ఊసులు సెబుతూకూకుంటే పొద్దోతాది. లెగు"

"మనం ఓళ్ళకోసం సెయ్యాల ఈపని? ఒవ్వడేనా ఈ సలిలో లేసి సుబ్రాని కెడతాడూ; మనకొచ్చింది కానీ?"

"బాబో! తెల్లారిపోతంది లెగే. తొరగా నడు." అని లేచి తలపాగాచుట్టుకొని మూలనున్న చీపురుతీసికొని దగ్గుకుంటూ బయటికి పోయాడు జగ్గులు.

బాగమ్మ చుట్టముక్కంటించుకొని రోడ్డుఊడ్చే చీపురూ తట్టా తీసికొని వెళ్ళిపోబోయింది. ఇంతలోకే 'బూచి'గాడి ఏడుపు వినిపించింది "లమ్మోం ..." అని మొదలెట్టాడు

"ఓరి సెనిపీనిగా - నువ్వు కూడా లెగిశావ్రా - నా పేణాలు తియ్యడానికి - పొంచెవులూ ఏనుక్కూర్చున్నారా నీవి" అని గుడిసె గుమ్మందాటింది ఆ కేళ్ళ కుట్టాడు బూచి లేచి అమ్మ వెంటపడ్డాడు. "వత్తన్నావట్రా - నే లేకపోతే ఒక్కచ్ఛనం ఉండలేవు" అంటూ తన బొడ్లో సగంకాల్చిన చుట్టపీకను తనుకాల్చే చుట్టనంటించి 'బూచి'కిచ్చింది వాడు గుప్పుగుప్పుమని వొదుల్తూ, మద్యదారిలో కనుపించే సిగరెట్టు గుల్లలు ఏరి అమ్మతట్టలో వేస్తూ, అమ్మ దూరంపోతే చిన్న కర్రపుల్ల తిప్పుకుంటూ పరిగెత్తి అమ్మను కలుసుకుంటూ పోతున్నాడు

మార్కెట్టు తుడుస్తోంది బాగి అమ్మ

పెట్టిన తుక్కుపోగుల్లో ఎందుకో వెతుక్కుంటూ, వాటిని తట్టలోకి ఎత్తుతున్నాడు బూచి

"అమ్మో - అంటిపండే" అని ఒక్కసారి అరిచాడు భాగి అక్కడికి వచ్చి మళ్ళీ తనోసారి ఆపోగు కెలికి, కుర్రాడి చేతులో పండుచూసి వెళ్ళి తనపనిలో నిమగ్నమయిపోయింది.

* * *

"ఒరే! బూచీ ప్రెసెంట్లుగోరింటికి పోదాం" అని కొడుకును పిలిచింది భాగి. వాడు గెంతుకుంటూ చేతిలో అరటి పండుతో అమ్మదగ్గరకు పోయాడు.

అప్పటికే సూర్యుని కెంజాయలు సన్నసన్నగా బజారుగోడలమీద పడుతున్నాయి భాగి వడివడిగా నడిచిపోతోంది బజారువీథులంట. 'ఒకటీ, పెసరట్' అనే కాఫీహోటళ్ళలోని సర్వర్ల కేకలు - 'కోడేరు కోడేరు - తణుకు తణుకూ' అనే కారుబ్రోకర్ల బోకరింపులు - 'వంకాయలేయ్ - బీరకాయలూ' అనే కూరలమ్మ కపువాళ్ళ కేకలూ. రోడ్డంతా 'ధంయ్' మనిపిస్తున్నాయి.

వడివడిగా సాగిపోతున్నారు. తల్లీ - కొడుకూ - "అమ్మ అదేంటే అంతమంది లోపలికోతున్నారు" అన్నాడు బూచి.

"అది కాఫీ ఒటేలు కొదంట్రా" అంది.

"మనం ఎల్లాంచా ?"

"ఎల్లకోడదు"

"ఉహూ." అంటూ పరుగుతీశాడు బూచి.

"........... .. ..."

"బాబెప్పుడూ కాఫీ పోయించడే ?" అన్నాడు మళ్ళీ బూచి తల్లిదగ్గిరికొచ్చి.

"ఆడంతే లేరా." అంది భాగి.

ప్రెసిడెంటు భూషణం ఇల్లొచ్చింది. ఇంట్లోకి పోయింది భాగమ్మ. "ఇంత ఆలస్యంగా వచ్చావేమే ? ఎల్లాగే ఇలా వస్తే .. అయ్యగారు కాఫీ తాగాకా రావడం?" అని ఇంటి యజమానురాలు కేకలువేస్తే, మామూలుగానే భరించి తన పనిలో నిమగ్నమయిపోయింది భూషణంగారు దొడ్లోకి వచ్చి "ఏమిటేవ్ భాగీ పొద్దెక్కువ చేసేస్తున్నావ్. ఇంకిలావస్తే కుదరదు పోసుకుందామంటే వేడినీళ్ళు లేవు...చలి కొరుక్కుతింటోంది..." అని అధికారం చూపించాడు.

భాగమ్మ పెరట్లో పనిచేస్తోంది. బూచి వీధిలో ఆడుకుంటున్నాడు. ఇంతలోకే భూషణంగారబ్బాయి రాంబాబు ఏడేళ్ళ వాడు అప్పుడేలేచి ముఖం కడుక్కోడానికి వీధిలోకి వచ్చాడు. 'బూచి'ని చూడగానే "అప్పుడే వచ్చావురా" అంటూ 'రాంబాబు' ఇటూ అటూ ముఖం తొల్చి అరుగుదిగి బూచిదగ్గర కొచ్చాడు.

క్రింద ఇసకలో గొంతుక కూర్చున్నాడు రాంబాబు. ప్రక్కనే బూచి కూర్చొని కట్టపుల్లతో తడిమట్టి తీస్తున్నాడు. 'రాంబాబు' పరికిస్తూ కూర్చున్నాడు.

"ఒరే! బూచీ నువ్వు కాఫీ తాగుతావురా ?" అడిగాడు ఒక్కసారి 'బాబు'.

"కాఫీ !. మా బాబోసారి సెప్పాడు. బాగుంటుందంట కదూ."

"నువ్వెప్పుడూ తాగలేదురా ?"

"లేదు."

"నే నిస్తా తాగుతావూ ?" అన్నాడు బుర్రూపుతూ 'బాబు'.

ఒక్కసారి బూచి ముఖం వికసించింది. ఏదో అవ్యక్తానందంలో తలఎత్తి ప్రక్కవంచి మట్టి గుప్పెళ్ళతో పోస్తున్నాడు.



"కాఫీ వేడిదే తాగుతార్రా" అన్నాడు బాబు.

'బాబు' ఒక్కపరుగున లోపలికి వెళ్లి మరుక్షణంలో తిరిగివచ్చాడు. మహానందంతో.

"ఒరే! బూచీ మా నాన్నగారు కారుమీద నన్ను బజారు తీసికెడతారట్రా... నువ్వుకూడ వస్తావురా?" అన్నాడు అమాయికంగా, గొప్పా బీదా కులం బలం విచక్షతలు తెలియని 'బాబు'.

"వస్తా! మాబాబు మా బండిమీద నన్నూ తీసికెళ్తానన్నాడు" ఏదో తనకీ ఓ గొప్పతనం ఉందని ధృవపర్చడానికి బూచి.

"కారెక్కావురా - బూచీ - నువ్వు?"

"మా బాబు కారు తుడిసేవోడు-'బూ'-'బూ' - అంటది కదూ! ముందర మెరుస్తాది.." అన్నాడు గర్వంగా బూచి తనకీ కారుగురించి తెలుసన్నట్టు.

ఎవరో కేకేస్తే లోపలికి పోయాడు 'బాబు' ఒక్క క్షణంలో కాఫీ గ్లాసుతో వచ్చి "బూచీ! తాగెయ్యి మా నాన్నగారు చూస్తే కోప్పడతారు" అని కాఫీ గ్లాసు అందించాడు కాఫీ అనేది ద్రవమైనదనీ, అది తాగుతారనీ మంచి వాసనగా ఉంటుందనీ బూచికి తెలియదు.

"అబ్బో! ఏడిగావుందే. ఏడిగావుంటే ఎలా తాగటం" అన్నాడు బూచి.

"కాఫీ వేడిదే తాగుతార్రా - మా అమ్మ మరిగే మరిగే కాఫీ తాగుతుంది. త్వరగా తాగెయ్యరా" అన్నాడు బాబు.

నోటిదగ్గరకు పోనిచ్చి రెండు గుక్కలు త్రాగేడు బూచీ మహానందంతో ఉప్పొంగిపోతోందా లేతహృదయం. "ఏమిట్రా ఇక్కడా?" అంటూ ప్రెసిడెంటు భూషణం అక్కడకు వచ్చాడు. బూచి కాఫీ త్రాగడం, బాబు ప్రక్కనుండడం చూశాడు భూషణం భేదం తెలియని వారి మనస్తత్వం అర్థంచేసుకోలేక పోయాడు. అహంకారం, అధికారం తలకెక్కాయి. హృదయవైశాల్యం అలవడలేదు ప్రెసిడెంటయినప్పటికీ! "పాకీవాడు తన కుఱ్ఱాడితో సమానంగా కాఫీ త్రాగుతాడా?" అనే భేదబుద్ధి అతనిలో 'హుక్కా' మత్తునిచ్చింది. 'బూచి' ధనదారిద్ర్యాల నిమ్నోన్నతాలు తెలియని చిన్నపిల్లవాడు అని ఊహించే విశాలహృదయం లోపించిందాతనికి. ఏదో అధికారం, పదవి, గౌరవం అనే తన శక్తులముందు 'బూచి' ఒక గడ్డిపోచకదూ! తన కొడుకు 'బాబు' నిజంగా 'బూచి' కంటే ఎన్నోరెట్లు ఎక్కువ. 'బూచిని పుట్టించినట్టు భగవంతుడు తన కొడుకుని నగ్నంగా పుట్టించలేదు' అని భావించివుంటాడు.

తీక్షణంగా చూశాడు బూచి కేసి భూషణం క్రోధంతో బుసలు కొడుతూన్నట్లుగా కనిపించింది భూషణం ముఖం బూచికి వణికిపోయాడు. కాఫీగ్లాసు వదిలేశాడు కంచుగ్లాసు బూచి కాళ్ళమీద పడింది కాలివేలు బ్రద్దలయింది. నెత్తురు చిమ్ముతోన్నా బూచికి వళ్లు తిమ్మిరెక్కినట్లు వుండటంచేత గుర్తించుకోలేదు. ఏడవాలని తెలియలేదు. కాఫీ చుక్కలు భూషణంమీదకు చిందాయి

"వెధవా. నామీద కాఫీ పోస్తావురా, స్నానం కూడా చేశాను" అని బూచి బుగ్గమీదకు చెయ్యి విసిరాడు ఒళ్లు తెలియని ఆవేశంతో.

పాపపుణ్యాలు కుటిలాకుటిలాలు తెలియని బూచి పేశలహృదయం కవ్వుమంది. ఏడుపు ఇప్పుడొచ్చింది. ఏడ్చాడు.

దొడ్లో బాగి వింది కొడుకు ఏడుపు. పరుగున వచ్చింది ప్రెసిడెంటును చూసి స్తంభించిపోయింది. తన కుర్రాడే దొంగతనం చేశాడో, ఏ ఘోరాపరాధం ఆచరించాడో! వెధవని తన్ని వేద్దాం అన్లాంటి పని చెయ్యకుండా అనుకుంది.

"చూశావా బాగీ నీ కొడుకు పొగరు. బాబుగారితో జతా? .. వేలేసి కాఫీ తెప్పించి తాగుతాడూ? కాఫీ ఏమిటి? రేపు మరొకటి తెప్పిస్తాడు." అన్నాడు తను కొట్టినదానికి తగిన కారణం వుందని తెలియజేయడానికి.

బాగికి ఇందాకటి తిట్లతోటీ ఇప్పటి విషయంతోటీ ఏ మూలనో దాగున్న ఆత్మాభిమానం ఘట్టిగా మూల్గింది నిల్చోలేకపోయింది పట్టలేని కోపంతో, చేసేది లేక బూచిని పట్టుకుకొట్టంది. బూచి గగ్గోలుగా ఏడుపు ఇంతలోకే జగ్గలు బండి తోలుకొస్తూ బూచి ఏడవడం విన్నాడు. బూచి ఏడిస్తే ఆ పితృహృదయం సహించదు. బూచి హృదయానికి కష్టం కలిగించే వాళ్ళని క్షమించడు జగ్గలు. తగువు కెడతాడు. బూచి అంటే జగ్గలికి ప్రాణం. "ఎవరే ఆణ్ణి కొట్టింది-" అని దూరంనించే కేక పెట్టాడు.

"ఏవుంది? ఈ గులాం ఎదవ కొవుందిగా గింట్లో ఓరికీ తెలియకుండా చిట్టిబాబు గోరిసేత కాఫీ తెప్పించుకు తాగుతున్నాడు. కొవుందికి కోపమొచ్చింది" అన్నది తను తప్పు చెయ్యనిదానిలా. తను కొట్టానని తెలిస్తే తన్ని పాతరెయ్యడూ జగ్గలు!

జగ్గలు బూచిని కొంవుందు కొట్టారని

ఊహించాడు. చేసేది లేదు; ఆత్మాభిమానం హుంకరించింది; కోపంతో వళ్ళు మండింది. కొడుకు బాధను చూడలేని ఆ తండ్రి పిచ్చి ఆవేశంతో "ఒప్పుడూ సెయ్యవుకదా" అని రెండు వేశాడు బూచిని.

బిడ్డని ప్రేమించవచ్చు. కాని బీదవాడు క్రియకి ఏమీ చేయలేడు. పరిస్థితులు అతనికి సహకరించవు. ప్రేమతో బిడ్డ కోరింది సంపాదించలేడు. ధనం! ధనం! మదకుంజరంలా అడ్డువస్తుంది. బిడ్డ కావాలన్నదల్లా తెచ్చిపెట్టగలడా, ప్రేమున్నా వాడికి సాగటానికి అవకాశమేది? ప్రేమ హృదయంలో లేకపోదు, కాని..

"బూచి ఏడుస్తున్నాడు. "నన్నే కనక కొడితేనా అన్నం మానేద్దును" అంటూ లోనికి పోయాడు బాబు.

బూచి గొంతుక పోయేటట్టు శక్తికి మించి ఏడ్చాడు అందరివల్లా ఆ బాల హృదయం దెబ్బతింది. చేసిన తప్పేమిటో అర్థంకాలేదు. కాఫీ త్రాగటం తప్పేమో అనుకున్నాడు - చెప్పలేని భయం - దానికి ఏడుపు జోడు—

*   *   *

సాయంత్రానికి బూచివళ్ళు ఫేళ్ళు మంటోంది - జ్వరం బాగికి పిచ్చెక్కింది. జగ్గులికి మతిపోయింది కలవరిస్తున్నాడు బూచి "లమ్మో ఇంకెప్పుడే తాగనే - బాబుగోరిచ్చారే" అంటున్నాడు మయమయాన్ని. జగ్గులు మందుకోసం పరిగెత్తాడు భూషణం ఇంటికి కెళ్ళాడు. "మీ సిన్ని గులాంఎదవకి జొరం కాచిందండి - కొంత మందు ఇప్పించమని సొప్పండి బాబూ" అన్నాడు ప్రెసిడెంటుతో జగ్గులు.

"బూచికి జరం వచ్చిందా - నాన్నా" అన్నాడు బాబు ఏదో అర్థంకానిబాధతో - తనకూ జ్వరమంటే ఏమిటో మహాతెలిసినట్టుగా.

"డాక్టర్నడిగి రెండు మాత్రలు తీసికెళ్ళు-అదే పోతుంది" అన్నాడు ప్రెసిడెంటు.

*   *   *

తెల్లారింది. జగ్గులు ప్రొద్దున్నే ప్రెసిడెంటింటిదగ్గర దించుకుపోయిన ముఖంతో, కళ్ళనిండా నీళ్ళతోటే నుంచున్నాడు. బాబు గమ్మున జగ్గుల్ని చూసి పరుగెత్తుకొచ్చి "బూచి ఎలావున్నాడురా - జరం తగ్గిందిరా - వత్తాడా ఆడుకోడానికి" అని అడిగాడు.

"వత్తా-డు-బా-బూ.. " అన్నాడు కళ్ళనీళ్ళు మాసిన గెడ్డాన్ని తడిపివేస్తూండగా. అర్థం కాలేదు 'బాబు'కిది.

బాగి బూచిని, ఎత్తుకొని ఏడుస్తూ రోడ్డువెంబడి పెద్ద అంగలతో రావటం చూశారు; జగ్గులూ, బాబూను.

బాబు ఒక్క సారన్నాడు "వత్తున్నాడు - బూచి, ఆడుకుంటాం లోపలే..."అని. ఏం తెలుసు చావుబ్రతుకుల సమస్య బాబు హృదయానికి? బూచి వస్తున్నాడని బాబు గంతులేశాడు."

★

సీరియల్ నవల

# రెండు మహా నగరాలు

— చార్లెస్ డికెన్స్

## 21

సిడ్నీ కార్టన్ తన జీవితంలో యెప్పుడైనా యే తావునన్నా ప్రకాశించాడో మనకు తెలియకపోయినా, డాక్టర్ మానెట్ యింట్లో మాత్రం యేనాడూ ప్రకాశించలేదని మాత్రం స్పష్టంగా చెప్పొచ్చు. అక్కడికి తరుచు వెడుతూనే వుండేవాడు. కాని యెప్పుడు చూసినా అదేపద్ధతిని నిద్రమొహం వేసి, ఏదో విచారంగా వున్నట్టు మందకొడి మనిషిగా కునికిపాట్లు పడటం మినహా సర్దాగా వుంటం ఎన్నడూ లేదు. ఏదైనా విషయం మాట్లాడదలిచినప్పుడు బాగానే మాట్లాడేవాడు. కాని అతను ఉత్సాహం తీసుకుని సర్దాగా మాట్లాడటమనేదే అరుదు. కాని, ఆ యిల్లన్నా ఆ వీధి అన్నా, ఆ బాటలో వున్న మూగరాళ్లన్నా అతని కేదో ఒక ఆకర్షణ వున్నట్టే కనుపిస్తుంది. రాత్రిళ్లు పిచ్చివాడులా ఆ వీధిలో ఇటూ అటూ ఎందుకో తిరుగాడుతూ వుండేవాడు. మధుపానంతో మరిచిపోవటానికి వీలులేనప్పుడల్లా, రాత్రిళ్లు ఆ వీధుల్లో పిచ్చివాడులా తిరుగుతూ కాలక్షేపం చేస్తూవుండేవాడు.

ఒకనాడు, ఇలానే, పనీపాటా యేమీ లేకుండా వీధుల వెంట తిరుగుతూండగా సిడ్నీకి మనస్సులో యేదో ఒక అభిప్రాయం హఠాత్తుగా తోచింది. సరాసరి డాక్టర్ మానెట్ యింటికి వచ్చేశాడు.

అతను మేడమీదికి వచ్చేసరికి, లూసీ, తన గదిలో ఒంటరిగా కూర్చుని యేదో పనిచేసుకుంటోంది.

సిడ్నీతో కాలక్షేపమంటే యేమనిషికీ అంత సర్దాగా వుండదు. లూసీకి అంతే; కొంత గిజాటుపడుతూనే, అతనికి ఆహ్వానమిచ్చింది. కాని, మామూలు కుశలప్రశ్నలు నడుపుతూ ఒకరి ముఖంవంక ఒకరు చూచుకోవటంలోనే, అతని మొహంలో లూసీకి యేదో ఒక మార్పు కనుపించింది

'కార్టన్‌గారూ! అలా వున్నారేం, వంట్లో కులాసాగా లేదా ?'—

'లేదు—అయినా నేను జీవితాన్ని నడుపుకొస్తున్న పద్ధతిలో, ఆరోగ్యం సరిగా వుండటానికి ఆస్కారం యెక్కడుంది ? నావంటి దుర్నడతలు నడిచేవాడు ఇంతకంటే బాగా ఎలా వుంటాడు ?'—

'క్షమించండి!— తెలివితక్కువగా ఒకమాట అడుగుతాను—ఇంతకంటే కొంచెం మంచి మార్గంలో నడవలేక పోవటం విచారకరమే కాదూ ?'—

'సిగ్గుబాట్ల పని కాదని యెవరంటారు'

'మరి, యెందుకు మార్చుకోగూడదూ ?'—

ఆ మాట అంటూ నెమ్మదిగా తల పైకెత్తి అతని ముఖంవంక చూచింది. అతని కనుకొలకులవెంట కన్నీరు దిగజారుతూ వుండటం చూచి గాబరాపడ్డది. అతని కంఠంలోకూడా దుఃఖం కళవళించుతోంది.

'లాభంలేదు—నేను బాగుపడేదశ దాటిపోయింది. నేను బాగుపడగలగటం అసంభవం; ఇంకా ఇంతకంటే నానాటికి దిగజారి అధోగతికావటం మినహా మరో గత్యంతరం లేదు.' అన్నాడు.

అరచేతుల్లో ముఖం కమ్ముకుని, మోచేతులు బల్లమీద ఆనుకుని మౌనంగా కూర్చున్నాడు. ఆ గంభీర నిశ్శబ్ద విరామంలో బల్ల గజగజా ఒణికిపోతోంది.

అతను అంతయిదిగా వుండటం లూసీ యెప్పుడూ చూళ్లేదు. అతన్ని చూస్తుంటే లూసీకి పేగులు తరుక్కుపోతున్నయ్. అలా కళ్లుమూసుకుని వుండే అతను లూసీ మనస్థితిని అర్థం చేసుకున్నాడు.

'క్షమించు లూసీ—నీ కేదో చెప్పదలిచి, ముందుగానే కుదబడిపోతున్నానల్లే వుంది—నేను ఒకటి చెప్పబోతున్నాను; వింటావా ?'

'తప్పకుండా వింటా సిడ్నీ—అందువల్ల నాకు ఏమాత్రం శాంతి లేశం కలుగుతుందన్నా, ఎంతో ఆనందించుతాను కూడా.'

'ఎంతో జాలిపేగులుగల స్త్రీవి; భగవంతుడు నిన్ను ఆశీర్వదించుతాడు.'

అతను నెమ్మదిగా ముఖంమీదినుంచి చేతులు విప్పుకుని నిబ్బరంగా మాట్లాడుతున్నాడు.

'నేను చెబుతున్న యీ విషయాలు విని గాబరాపడకు—నేను యౌవ్వనదశలోనే మరణించిన వ్యక్తిలా వున్నాను. నా జీవితమంతా ముగిసిపోయినట్టే.'

'అలా అనకు సిడ్నీ; నీకు ముందు ముందు తప్పకుండా మంచిరోజులు వస్తయ్. తప్పకుండా యింతకంటే యెంతో గౌరవంగా బ్రతుకనున్నావ్.'

'నిన్ను నా జీవితంలో యెన్నటికీ మరిచిపోలేను'—

లూసీ కంగారుగా వణికిపోతోంది.

'ఒకవేళ నా ప్రేమను నువ్వుకూడా ఆదరించావే అనుకో—అందువల్ల వచ్చే ప్రయోజనమేమీ లేదు—ఆ సంగతి నాకు స్పష్టంగా తెలుసు; నేను తప్పదాగి, జీవితాన్నంతా చెరుపుకున్న వ్యర్థుణ్ణి—ఇతరుల ప్రయోజనాలకు తప్ప నాకుగా నేను ఎందుకూ పనికిరాకుండా జీవితాన్నంతా వ్యర్థం చేసుకున్న దౌర్భాగ్యుణ్ణి, మొత్తంగా నాశనమైపోయాను. ఈ స్థితిలో నీవు నాకు చేయి ఆసరాయిచ్చి నిలబెట్టాలని చూస్తే, నిన్ను కూడా నాతోపాటు నరకకూపంలోకి దిగలాగి పారేస్తాను, దారిద్ర్యం

అనువాదం: తెన్నేటి సూరి

లోకి క్రుంగదీస్తాను. అవమానపరంపరల అఖాతంలోకి యీడ్చుకుపోతాను. ఈ సంగతి నాకు బాగా తెలుసు; నీకు నాపట్ల యెలాంటి మమకారమూ లేదని నాకు తెలుసు; అలాంటిది వుండాలని కూడా నేను వాంఛించటంలేదు. పైగా అలాంటిది లేనందుకు లోలోపల యెంతో సంతోషించుతున్నాను '

'అలాంటది ఏమీ లేకుండా మరోవిధంగా నీకు నేనేమీ సాయపడలేనా సిడ్నీ—నిన్ను మానవలోకంలోకి తిరిగి చేదుకోలేనా ?—క్షమించు—నిన్ను మంచిమార్గంలోకి తిప్పుకోలేనా ? నీకు నాపట్ల వున్న ఈ విశ్వాసానికి, యేవిధంగానూ ప్రతి విశ్వాసం చూపుకునే సావకాశం నాకు లేదా ?—యీ విషయాన్ని నువ్వు మరొకరితో చెప్పవని నాకు తెలుసు—మనలో మనఆంతర్యం మాటగా అడుగుతున్నాను—నీకు మేలు కలిగేవిధంగా, నేను చేయగలదేమీ లేదా ?'—

'లేదు—లేదు లూసీ అలాంటి అవకాశమేమీ లేదు. ఇప్పుడు నేను చెబుతున్న ఈ నాలుగుముక్కలూ నువ్వు విన గలిగితే అక్కడికి నీవు నాకు చేయగలిగిన ఉపకృతి యావత్తూ చేసినట్టే; ఒక్కవిషయం నీకు తెలిసివుంటే నాకు చాలు. నేను మామూలుగా కలలుగనేవాణ్ణికాదు. నా జీవితానికల్లా కలగంటున్నది నీఒక్కమూర్తినే. నాలో మానవత్వం నశించి పతితుణ్ణయిపోయినమాట నిజమే ; అయినా ఉజ్వలమూర్తిని అభినందించగల మానవత్వలేశం నాలో మిగిలింది. నీ తండ్రి ప్రక్కను నీవు సంచరించుతున్న వైఖరి నన్ను ఆకర్షించింది. నీవు నిర్మించిన ఈ ప్రశాంతగృహ వాతావరణం, నాలో యేనాడో నశించి పోయిన తీపి తలపుల నీడలనెన్నిటిని నిద్రలేపి మేల్కొలిపింది. ఆ తీపి తలపులు నన్ను ఈ అఖాతంలోనుంచి పైకి రమ్మని గుసగుసగా పిలుస్తున్నట్టు తోచింది. నాలో పైకి పెగుల్చుకు లేవాలనే, చిన్ని చిన్ని ఆవేశాలు రేఖలుగా అంకురించినై. అవన్నీ చాలా బలహీనమైన చైతన్యరేఖలు. అదంతా వట్టి కలమోస్తరు. కల అంతంకాగానే, మళ్లా మనిషి మామూలు పూర్వంమనిషిగానే వుండిపోతాడు. కాని నాలో అలాంటి కలలను సృష్టించినదానివి నువ్వే !—ఇది నువ్వు తెలుసుకోగలిగితే అంతవరకు నాకు చాలు !'

'ఆ కలలో కొంత గాకపోతే కొంతైనా నిలువరించుకోలేవా ? మళ్లా అదే కలగను సిడ్నీ—మళ్ళీ ప్రయత్నించు '

'లేదు లూసీ— ఆ కలగంటున్నంతసేపూ కూడా నా స్థితి నాకు అర్థమౌతూనేవుంది. ఆ స్థితికి నేను అనర్హుణ్ణని నా మనసు నాకు చెబుతూనేవుంది. అయినా నాలో వున్న బలహీనత యేమిటంటే : ఇంతా తెలిసివుండికూడా నీతో ఈ విషయాన్ని చెప్పకుండా వుండలేకపోయాను. సొంతం చల్లారి బూడిదగుట్టలా వున్న నాలో ఈ అగ్నిని ప్రజ్వరిలచేసింది నీవేనని చెప్పకుండా వుండలేకపోయాను. కాని ఇవన్నీ వట్టి వ్యర్థమైన కాటూకుమంటలు నా తత్వం వాటికి కూడా సంక్రమించింది ఈ జ్వాలలు నాఅంతటికి నాకుగాని యితరులకు గాని ఉపకరించేవి కాదు. అలా వ్యర్థంగా మండి మండి ఆరి నశించిపోవటం మినహా వీటికి మరో ప్రయోజనమేమీ వుండదు '

'నన్ను చూడకపూర్వం కొంత గాకపోతే కొంతైనా శాంతిగా వుండేవాడివేమో—నిన్ను మరింత దుఃఖంలోకి పడలాగాను సిడ్నీ—ఎంతేనా దురదృష్టవంతురాల్ని.'

'అలా అనవద్దు లూసీ—నేను బాగుపడటానికి ఏమాత్రం సావకాశమున్నా నీవు నాకు తప్పకుండా పునర్జన్మ నివ్వటానికి ప్రయత్నించి తీరేదానివి. నీ ఉదారత నాకు తెలుసు. నేను మరింత దిగజారిపోతే అందుకు నీ వెప్పుడూ బాధ్యురాలివికాదు '

'సిడ్నీ ఒక్కమాట అడుగుతాను చెప్పు—నేను నీలో ఏదో ఒక చైతన్యరేఖను ప్రభవింప చేశానని అన్నావ్—అలానే నాలో వున్న యేశక్తినైనా ఉపయోగించి నీకు ఉపకారం చెయ్యలేనా?'

'నా హృదయాన్ని విప్పి నీయెదట చెప్పుకునే అవకాశం యిచ్చావు—ఇది చాలు—పతితుణ్ణయిపోయిన నాపట్ల నీ మనస్సులో జాలి వున్నదనే ఒక్క సంతృప్తి నాకు చాలు '

'నామాట విను సిడ్నీ అలా దించుకుపోకు—నీలో అనేకమైన ఉత్తమ గుణాలున్నయ్—ప్రయత్నించితే తప్పకుండా పైకి లేవగలవు—నామాట నమ్ము'—

'నా సంగతి నాకు తెలుసు లూసీ—పాపం నీ మనస్సును క్షోభపెడుతున్నానల్లే వుంది. త్వరగా ముగించేస్తాను నా మనస్సులో వున్న ఈ రహస్యాన్ని నీ అమాయక హృదయంలో వుంచి వెడుతున్నాను—నీవు నన్ను కనికరించుతున్నావంటే ఏదో ఒక సంతృప్తి నాకు కలుగుతోంది. అందుకోసం నీ ముందు నా హృదయం విప్పి చెప్పుకున్నాను. ఈ రహస్యాన్ని యెప్పటికీ యెవ్వరికీ చెప్పనని వాగ్దానం చెయ్యి'—

'అందువల్ల నీకు ఆత్మశాంతి కలుగుతుందంటే—ఎన్నటికీ యెవ్వరికీ చెప్పను'

'నీ హృదయంలో హృదయమైన పరమ సన్నిహితుడికి కూడా చెప్పకూడదు '

'సిడ్నీ ఎందుకంత అపనమ్మకం—ఈ రహస్యం నీదిగాని

(22-వ పేజీ చూడండి)

# వింత చుట్టరికాలు

## 1

ఇదుగో! మిమ్మల్నే, పిలుస్తుంటే పలకరేం.

" . ........... "

"గంటసేపటినుంచి నోరుపడిపోతున్నా పలకరేమండి! అయినా అంత మొండితనం యేమిటి."

"ఊఁ". ...

"అబ్బ! ఎప్పుడు యేమిటా రాత! పొయ్యిమీద కూర మాడిపోతోంది, కాస్త అబ్బాయిని తీసుకుంటారేమోనని పిలిచా."

"ఎప్పుడు యెవరెత్తుకు కూర్చుంటారు. పిల్లలతో ఆడుకుంటూ కూర్చుంటే ఆఫీసు పని యెవడు చేస్తాడు నీ తాత."

"కాసేపు పిల్లడిని యెత్తుకోడానికి అంత కష్టమైతే, ప్రొద్దస్తమానం యెత్తుకుని తిరిగే నాకు యెట్లా వుండాలండీ?"

"మహా యెత్తుకొని యేడ్చినట్లు, సరేలే! అక్కడ కూర్చోపెట్టి వెళ్లు"

"బల్లమీద కూర్చోపెడితే క్రిందపడతాడేమో! కాస్త మీ వొళ్లో కూర్చోబెట్టుకొని ఆడిద్దురూ"

"ఎందుకు? వంటిని గుడ్డల్ని పవిత్రం చేయడానికా"

"అబ్బబ్బ! తీసుకోండి! అక్కడ కూర బొగ్గులైపోతోంద"ని వంటింట్లోకి పరుగెత్తింది రాధ.

.. .................. ...

.. .......................

... .. . ..............

"నేను మొట్టమొదటే చెప్పేను, పిల్లాడిని రానురు నే బల్లదగ్గరకు తీసుకురావద్దే అని. ఇప్పుడు ఆ కాగితాలనిండా కరాబు చేశాడు"

"ఫరవాలేదు లెండి! చిన్నపిల్లాడు. వాడికేం తెలుసు?"

"సరేలే, తీసుకో, తీసుకో మహా జెన కేసుకు వచ్చావు ముద్దులకొడుకుని"

"కాక,.. అదుగో యెవరో వీధితలుపు కొడ్తున్నట్టున్నారు. మా నాన్న వచ్చాడేమో" అంది రాధ.

నేను వెళ్ళి వీధితలుపు తీశాను. సుమారు 50 సంవత్సరాలు వయస్సుగల ముసలాయన, ఆయన భార్య అనుకుంటా ఒక ముసలావిడ, ఇద్దరు చిన్న అమ్మాయిలు తలుపు దగ్గర నిల్చున్నారు. వీరినందరిని చూచేటప్పటికి నాకు ప్రాణాలు పైనే యెగిరిపోయినై. అసలే రేషనింగురోజులు. ఇంత మంది చుట్టాల్ని యెట్లా...వారం కిచ్చే బియ్యం మంగళవారం సాయంత్రానికే అయిపోతై రెండుపూటలాతింటే. ఏ వస్తువా యెటువంటి ఆపదసమయంలోనూ *Black Market* లో కొనను అని, కమ్యూనిస్టు సిద్ధాంతాలుగల నా ముఖ్యస్నేహితుని వద్ద దేముడిసాక్షిగా ప్రమాణం చేశాను. అంగువల్ల ఒకపూట వరిఅన్నం తిని రెండవపూట చపాటీతో గడుపుతున్నాము. ఇప్పుడు బియ్యం యెక్కడ నుండి తీసుకురాను అని దిగులు యెక్కువైయింది. ఈ విచారంతో కొంతసేపటి వరకు నా నోరు పెగలలేదు.

"మోహన్‌రావుగారి యిల్లు యిదే గదండీ" అన్నాడు గుమ్మంలో అడుగు పెడుతూ.

"అవును! లోపలకు దయచేయండి" అన్నా.

లోపల ఆయనకు కుర్చీ చూపించాను. కుర్చీలో కూర్చుని ఆయన చుట్టకు నిప్పు ముట్టించాడు. ఆయనతో వచ్చిన ఆడవాళ్ళు రాధతో మాట్లాడుతున్నారు.

"మిమ్మల్ని చూచి చాలా రోజులైంది. అందుకనే గుర్తుపట్టలేకపోయాను" అన్నాడు.

"అవును. బహుశ నన్ను పెళ్ళిలో చూచారనుకుంటా."

"అప్పుడు చూచాను మిమ్మల్ని. మళ్లా యిప్పుడు చూచాను. చాలా మారిపోయారు గుర్తుపట్టలేకుండా అయిపోయారే."

"ఇంకా గుర్తుపట్టడమేమిటండి? ముసలివాళ్లమైపోతే"

"అరే! సరిగ్గా 25 సంవత్సరాలైనా నిండలేదు. అప్పుడే ముసలివాళ్లయినారనుకుంటే ఇక మాబోటివారి సంగతేమిటండీ. మేమే మనుకోవాలి"

.................

"మీ కెక్కడ వుద్యోగం?" అన్నాడాయన.

"ఇక్కడే. ఈ వూళ్లోనున్న సినిమా హాల్సుకి *Engineer* గా వుంటుంటా."

"మీరు యెంతన్నారు జీతం."

"ఈ వూళ్లోనున్న హాలువాళ్ళందరు తలా రెండొందలు యిస్తుంటారు. మొత్తం మీద నెలకు హీనం 7, 8 వందలన్నా వస్తూంటుంది."

"అయితే మంచి వుద్యోగమే"

.. ..... .. ....

"అమ్మాయి! రాధా?" అన్నాడు.

"వస్తున్నా మామయ్యా" అని అక్కడకువచ్చింది

"కులాసాగావున్నావామ్మా"

"ఆ! కులాసాగానేవున్నా"

"ఎన్నో నెలన్నావు?"

"మొన్నే యెనిమిదో నెల వెళ్ళి, తొమ్మిదో నెల ప్రవేశించింది"

"ఏమిటండి అల్లుడుగారు! 9వ నెల ప్రవేశించిన అమ్మాయిని పుట్టింటికి పంపలేదు" అన్నాడు నావైపుతిరిగి.

"ఆ! అది ఇక్కడే పురుడు పోసుకుంటానందండి" అన్నా.

"ఇక్కడెందుకమ్మా! అక్కడనాన్న, అమ్మ, అందరుండగా" అన్నాడు రాధ వైపుతిరిగి.

"అది పల్లెటూరు! అవసరమొచ్చినప్పుడు మంత్రసానులు, వాళ్లు వుంటారో, వుండరో.. అవస్థ పడాలని..." అంది రాధ.

అసలు ఇంతకీ ఈయనెవరో చెప్పలేదే, నాకేమాత్రం! బహుశామామగారి వరస అయ్యుంటాడు లేకపోతే అల్లుడని యెందుకు సంబోధిస్తాడు. అయినా అడుగుదామా! ఛ! ఛ! అడిగితే బాగుండదు. ఇప్పుడు వీళ్ళందరికీ కనీసం 6 శేర్ల బియ్యమన్నా కావాలి. యెక్కడనుంచి తీసుకురాను? పోనీ *Black* లో బియ్యంకొంటే. ఛ! ఛ? నీమానికి వ్యతిరేకం ఇన్నాళ్లనుండి కాపాడుతున్న నీమం అంతరించదూ! ఏమైనా సరే నీమానికి భంగం

★ శ్రీ నెప్పల్లి మోహనకుటుంబరావు ★

కలిగించకూడదు. ఆయన రాధతో హాస్కు వేసుకూర్చున్నాడు కొంతసేపటికి ఆయన భార్య పిలవగా రాధ యెందుకో లోపలకు వెళ్ళింది.

"యేమిటి! దీర్ఘాలోచనలో ఉన్నారు" అన్నాడు నావైపుకు తిరిగి.

"ఎబ్బే! ఏమిలేదు, మిమ్మల్ని యెక్కడో చూచినట్లు జ్ఞాపకం. యెక్కడాని"

"మీ వివాహానికే చూచారు నాపేరు మాధవరావు. మీ మామగారు శ్రీనివాసరావుగారు నాకు సయానబావ అవుతాడు. అంటే మా చెల్లెల్ని ఆయనకిచ్చాములెండి"

"ఓహో! అదా బంధుత్వం"

"వస్తూపోతుంటేనే గదండీ బంధుత్వం; లేకపోతే యేముంది"

"అవును, అవును"

"ఇదుగో! మిమ్మల్నే" అని పిల్చింది రాధ.

"వస్తున్నా!"

ఇప్పుడే వస్తానని మాధవరావుగారితో చెప్పి లోపలకు వెళ్ళేను రాధనాపడకగది దగ్గర మంచంమీద కూర్చునివుంది. ఆయనతోవచ్చిన ఆడవాళ్లు స్నానం చేస్తున్నారనుకుంటా

"పిలిచావా" అన్నాను మెల్లిగా బుగ్గమీద మీటుతూ

"అబ్బా! యేమిటి వేళాకోళం యెవరన్నా వచ్చినప్పుడు కూడా . ."

"సరలే! అసలు యెందుకు పిలిచావు?"

"అవసరంలేకుండా పిలవడానికి నాకేం పనీపాటా లేదనుకున్నారా?" అంది మూతి ముడుచుకొని.

"అయితే త్వరగా చెప్పు"

"ఆ! మరి బియ్యం సంగతి ఎట్లా అని! వీళ్ళపెట్టెలు అవి చూస్తే పెద్ద మకాము వేసేటట్లున్నారు. పోనీ లెండి, సమయానికి వచ్చారు. ఒక బస్తా బియ్యం *Black Market* లో కొన్నామంటే పురుడు వెళ్ళిపోతుంది"

"ఏడిచినట్లుంది, నీ ఆలోచన. ఇంతకుందిని ఒకపూట భరాయించడం యెలాగానిసే చూస్తుంటే నెలల తరబడి వుంచుకుందామంటావు. నీకేం తెలుస్తుంది ఆ కష్టం, పడేవాడికి తప్ప. అయినా చుట్టాలుయెవరన్నా తమ తరపు వాడువస్తే సరి, భూమి ఆకాశము కనబడదు. కొత్త భూమి చూసినదు మరీ.....అన్నాను. ఇంతలోనే. ఆయన భార్యాగామున్న—

"రాధా! ఇటు రామ్మా ఒకసారి" అంది గదిగుమ్మందగ్గరకువచ్చి.

"వస్తున్నా అత్తయ్యా" అందిరాధబిగ్గరగా; గుమ్మందగ్గరకువచ్చిన ఆవిడను చూడకుండా.

"ఆవిడపిలుస్తున్నట్లుంది. మరి బియ్యం సంగతి యేంచాశావు. మన ఇంట్లోవున్న బియ్యం ఈపూటకే సరిపోతేమరి, రేపు ప్రొద్దునకు యెట్లా"

(19–వ పేజీ చూడండి)

# ఉద్యోగం

శ్రీ చిల్లర భావనారాయణ

స్థలం: ఒక మిల్లు ఆఫీసుముందు వరండా.

సమయం: మధ్యాహ్నం ఒకటిన్నర.

రాజారావుకు దాదాపు ముఫ్ఫై సంవత్సరాలుంటై మనిషి సన్నగా పొడుగ్గా వుంటాడు. చినిగిపోయి చాలీచాలని పాంటు కోటు వేసుకొని అధికారి పిలుస్తాడేమో అని అడేపనిగా డ్రెస్ సద్దుకుంటూ నిరీక్షిస్తుంటాడు. లోపల్నుండి ప్యూన్ వస్తాడు.

రాజా ఇదిగో బాబూ ఇలా రా.

ప్యూన్ : ఎవరండీ మీరు – ఎవరికోసం వచ్చారు?

రాజా: నాపేరు రాజారావ్. మానేజర్ని చూట్టానికి వచ్చాను.

ప్యూన్: ఎందుకు?

రాజా ఉద్యోగానికి.

ప్యూన్ ఇక్కడేం వుద్యోగాలు లేవు వెళ్ళిరాండి.

రాజా: ఆ సంగతి నువ్వెట్లా చెప్పగలవు?

ప్యూన్: నాకు తెలీని విషయం అంటూ ఈ ఆఫీసులో వుంటుందేంటి – అయినా మీరీ వరండాలో ఈలా తచ్చట్లాడుతూ తిరగటానికి వీల్లేదు ఇక్కణ్ణుంచి వెళ్ళండి.

రాజా: నీ పుణ్యమాయిరి బాబూ కాస్త ఆయన్తో మాట్లాడిపోనియ్. నీవల్ల నాకెంతైనా సహాయం కావాలి అసలు అధికార్ల దేముంది. వాళ్లు గర్వంకొద్ది గ్రుడ్డిగా ప్రవర్తిస్తారు. అంతా మీ చేతుల్లోనే వుంది .. ఈ అప్లికేషన్ కాస్త లోపలియ్యి బాబు.

ప్యూన్: ఆయన చాలా ఆగ్రహంగా ఉన్నారు ఇప్పుడీ కాయితం ఇస్తే బుట్ట దాఖలా చేస్తారు.

రాజా: కోపం దేనికి?

ప్యూన్: వారి అల్లుడుగా రోస్తున్నాటట యివ్వాళ.

రాజా: కూతుర్ని తీసికెళ్టానికే!

ప్యూన్: కాక అయ్యగార్ని తీసికెళ్టాని కనుకున్నావా?

రాజా: అదికాదు ఆ అల్లుడికి ఇప్పుడే ఏం తొందరొచ్చిందని.

ప్యూన్: అసలు అయ్యగారు అమ్మాయిగార్ని పంపకేం. ఆయనగార్ని ఇక్కణ్ణే వుండిపొమ్మంటున్నాడు. కాని వప్పుకోటం లేదు.

రాజా: ఆ దౌర్భాగ్యుడికి ఇదేం పొయ్యేకాలం నాకామాత్రం అవకాశముంటే . అయితే మాడు ఆ విషయం తాపీగా కాఫీ త్రాగింతరవాత మాట్లాడుకోవచ్చుగాని ఈ అప్లికేషన్ లోపలపెట్టు బాబు

ప్యూన్: ఇప్పుడు కాదులెండి అయ్యగారు టిఫిన్ తిని చల్లబడ్డాక ముందుపెట్టచ్చు. మా కష్టాలు మీకేం, తెలుస్తై. అయ్యగారి వాలకం కనిపెట్టి యిట్టి కాయితాల మీద అర్జెంట్లేయించుకోస్తా. హెడ్ గుమాస్తాగారికూడ నేనంటె మహాయిది.

రాజా: ఇదిగో ఈ బేడ తీసుకోవెళ్ళి కాఫీ త్రాగిరా. తర్వాత మాట్లాడుకోవచ్చు. (డబ్బు లిస్తాడు)

ప్యూన్: తమరు రాయా.

రాజా: నే నిప్పుడే పుచ్చుకున్నాలే.

ప్యూన్: సరే – ఆ కాయితం కూడా నా చేతికివ్వండి.

.. .. . .. ..

రాజా: కష్టం! వీడికష్టం ఆలోచించాలిట. నా కష్టం ఎవరాలోచిస్తారు? ఇవాల్టి వుద్యోగప్రయత్నానికి పాత కాగితాలమ్మి రెండణాలు శ్రీమతి మూటగట్టింది నిన్న.. అదిగో ఎవరాయన .. మ్యానేజరే. లోపల లేడన్న మాట... గుడ్ మార్నింగ్ సార్.

మానే (లోపలికి పోయేవాడు ఆగి) ఎవరు నువ్వు?

రాజా: నిరుద్యోగిని.

మానే: ఇక్కడేం వుద్యోగాలు లేవు.

రాజా. వున్నయ్యని విన్నాను సార్.

మానే: ఎవడా చెప్పిన వెధవ!

రాజా: క్షమించాలి సార్ – కరుణించాలి సార్.

మానే: సరే లోపలికిరా మాట్లాడుదాం.

.. ........ ...

...............

మానే: నువ్వేం చదువుకున్నావ్.

రాజా: B A., L., L. B

మానే: బోర్డు కట్టుకోకపోయావ్.

రాజా: డబ్బులేదండి.

మానే: ఇన్నాళ్లూ ఏంచేశావ్.

రాజా: నాటకాల్లో వేషాలేశేవాణ్ణండి.

మానే: ఇప్పుడెందుకు మానేస్తున్నావ్?

రాజా: రాబడి బొత్తిగా లేకండి.

మానే: ఏ ఏ వేషాలేసేవాడివి?

రాజా: (సంకోచిస్తూ నవ్వుతాడు కొద్దిగా)

మానే: ఇకిలిస్తావేమయ్యా.

రాజా: చంద్రమతి, సావిత్రి.

మానే: సరె ఇంతకూ మాకు టైపిస్టు కావాలి

రాజా: పోనీ టైపిస్టు వేకన్సీ వుందిట..!

మానే: వున్నమాట నిజమేగాని ..

రాజా: పిల్లలు కలవాణ్ణండీ (దీనంగా)

మానే: అందరికీ వున్నారు.

రాజా: తింటానికి కూడా సరిగ్గా తిండి లేక

మానే: పెళ్లెందుకు చేసుకున్నావ్.

రాజ: పొరపాటేనండి.

మానే: ఆ టైపిస్టు వుద్యోగం నీకాదు. శారదానికేతనంలో మొగుడొదిలేసిన ఒక అనాథవుంది, ఆమెకోసం రిజర్వుచేశాను ఆలాటివాళ్ళకి సాయం చేయకపోతే దేశగౌరవం ఏముందిక.

రాజా: నేను ఆమెకన్నా అనాథనండీ సార్

మానే: ఒప్పుకోను.

రాజా: ఆమె ఒక్కతే ప్రాణి. కాని నా జీవానబడి పెళ్లాం పిల్లలు వునూరుమని పోతారండి.

మానే: చదువుకున్న భార్యను చేసుకోకపోతే ఇంతే

రాజా: అంటే మీ వుద్దేశ్యం?

మానే: మధ్యతరగతి కుటుంబాల ఆర్థిక పరిస్థితి చక్కబడాలంటే స్త్రీ పురుషులిద్దరూ పనిచేయాలి.

రాజా: ఒప్పుకున్నానండి.

మానే: నువ్వొప్పుకుంటే ఎంత ఒప్పుకోకపోతే ఎంత. అదీ యధార్థం

రాజా: చిత్తం గ్రహించా...సండిమరి ఉద్యోగం?

మానే: అదేం లాభం లేదు. వెళ్ళు. నాకు చాల తొందరపని వుంది.

.. .... .. ...

రామం: ఏమన్నాడ్రా.

రాజా: ఖాళీ లేదుట.

రామం: ఆ టైపిస్టు ఉద్యోగముందిగా

రాజా: శారదానికేతనంలో ఓ అనాధ స్త్రీ వుందిట ఆమెకోసం రిజర్వు చేశాట్ట.

రామం: వట్టి బుకాయింపు

రాజా: అంతేనంటావా?

రామం: వాడికో లేడీని అపాయింటు చేయాలని మహాయిదిగా వుందిలే

రాజా: నిజంగానా?

రామం: మహా జల్సారాయుళ్లే.

రాజా: సరే వెళ్ళొస్తాను.

రామం: సారీ బ్రదర్...

.. ............

........ ......

(రాజారావు ఇల్లు)

సీత: ఏమండీ..అలా దిగాలు పడి కూచుంటె ఏంలాభం? ఎక్కడన్నా ఇవ్వాళకూడ ప్రయత్నించక పోతే ఏంలాభం?

రాజా: ఏం అఘోరించమంటావ్... వెళ్తాను. ఇంట్లో ఎందుకూర్చుంటాను. ప్రతి ఆఫీసు చుట్టూ మరోసారి తిరిగొస్తాను.

సీత: ఆ టైపుపనికి ఎవరిచేతన్నా చెప్పించకపోయారూ

రాజా: నామీద ఆమాత్రం జాలిచూపే ఘరానావాడొహడుంటె యీ ఏడుపంతా దేనికి. పిల్లలన్నం తిన్నారా?

సీత: ఆ. పాపం పెద్దవాడు నాన్నతో తింటానని ఒకటే గోల. చివరకి ఇంకొద్దిగా అన్నం పెట్టమని ఏడ్చాడు పాపిష్టి దాన్ని మనం ఎన్నాళ్ళని మంచినీళ్లతో బ్రతగ్గలం......పోనీ ఎవరన్నా అప్పిస్తారేమో...

రాజా: ఏం చూసి?

సీత: మరెట్లా?

రాజా: అదే ఆలోచన

సీత: మీ స్నేహితుడు రామం...

రాజా: ఇప్పటికే వాడికి చాలయివ్వాలి. వాడి పరిస్థితీ అధ్వాన్నం చతుర్మధ్యంగా వుంది.

సీత: ఇక మన కేది దారి!

రాజా: ఏయ్.. సరేగాని నీ పెద్ద చీర రెవిక ఈలా తే.

సీత: అయ్యో ఇహ మళ్ళీ ఆ నాటకాలకి బయల్దేరితే కూడుగుడ్డా గతేం కానండీ. అవేం వందలు కుమ్మరించేనా చెప్పండి

రాజా: నువ్వరవక త్వరగా తీసుకురా.

సీత: సరే.. (వెళ్తుంది)

రాజా: ఉద్యోగం ఏలాగైతేనేం సంపాదించానా ఎక్కడైనా ధైర్యంగా అప్పుతేవచ్చు. వుకు తుందిక్కడ ఏలాగో సర్దివాడుకొని బాగుపడగలం. ఆతర్వాత?

సీత. (వస్తూ) ఇదిగో......మళ్ళీ ఈ రోజునుండీ నాటకాలు మొదలు.

రాజా: ఈ రోజునుండీ ఏంఖర్మం




"ఇదిగో ప్రస్తుతం ఈ యాభైతీసుకోండి"

పుట్టినప్పట్నుంచీ నాటకమే. జీవితమే ఓ పెద్దనాటకం (లేచి వెళ్తూ) తలుపేసుకొని ఈ రోజేలాగో గడుపు.

సీత : మళ్లీ ఎన్నింటికి రావటం?

రాజా : పొద్దుపోతుంది.

.. ...... ......

........... ...

(మానేజర్ ఆఫీసు గది. రాజారావు చక్కని స్త్రీవేషం ధరించి, మాధుర్యమైన స్త్రీ కంఠంతో)

రాజా. లోపలికి రావచ్చునాండీ

మా : హలో.. ఆఁ ఎవరు! రాండి రాండి ఆ కుర్చీలో కూచోండి. మీ పేరు? (అంటూ వెకిలిగా నవ్వుతాడు)

రాజా : రాజ్యలక్ష్మి అండి.

మా : ఓ. ఏం పనిమీద వచ్చారు?

రాజ్య : మీ ఆఫీసులో ఒక టైపిస్టు పోస్టు ఖాళీగా వుందని విని...

మానే : వెరీగుడ్, చూశారూ. మీ క్వాలిఫికేషన్?

రాజ్య : మెట్రిక్ ప్యాసైనాను. టైపింగ్ హయ్యర్ ప్యాసైనా.

మా : వెరీగుడ్-వెరీగుడ్. ఆఁ చూశారూ. ప్రస్తుతం మీకు మొత్తం వందరూపాయీలు జీతం - ఆతర్వాత...

రాజ్య. తమ అభిమానం ఆదరణ వుంటే అంతే చాలు.

మానే : మనస్సు కలవాలేగాని మీకెంతైనా సాయం చేయనుటండి. ఆ వైదిక్కై మీకు పనిలో ఏం తొందరలేదు. మీ చేతనైనకాడికి చెయ్యండి. మీకేమన్నా కష్టసుఖాలుంటె నాతో సరాసరి వచ్చి నిరభ్యంతరంగా చెప్పేయండి.

రాజ్య : మంచిది, ఆలాగే.

మానే : మాయిల్లుకూడా దగ్గరే. మీరుండటం ఎక్కడ?

రాజ్య. కొత్తపేట.

మానే : చాలాదూరం.

రాజ్య. కడుపుకోసం రావాలి ఏం చేస్తాం.

మానే : అంతదూరంనుండీ రావాల్సిన శ్రమ ఎందుకు. మామేడపై భాగం ఖాళీగానేవుంది

రాజ్య. మీరు నిజంగా చాల దయామయులండి.

మానే : (ఇకిలించి) ఏదో - నాహృదయం అటువంటిది - మరి పనిలో యివాళే ప్రవేసిస్తారా.

రాజ్య : రేపు మంచిరోజు.

మానే పోనీలెండి.

రాజ్య : అడిగానని ఏమీ అనుకోకపోతే. .

మానే : ఏం కావాలి

రాజ్య : ఏదో బీదసంసారం. ఆఫీసుకి కాస్త నీటుగా రావాలంటే మరో నాలుగు చీరలైనా కావాలి.

మానే : డబ్బు అవుసరమా?

రాజ్య : అడ్వాన్సు పేమెంటు కొంత,

మానే. ఓ అలాగే.. ఇదిగో ప్రస్తుతం ఈ యాభై తీసుకోండి.

రాజ్య. సాయంత్రం తమని యింటి దగ్గర కలుసుకుంటాను.

మానే : ఓ తప్పకుండా కలుసుకోవాలి.

రాజ్య థాంక్ యు మై డియర్ సార్

★

# వింత చుట్టరికాలు

(15-వ పేజీ తరువాయి)

"రేపు ప్రొద్దునకు ప్రక్కవారింట్లో బదులుతీసుకుంటా"అంది.

"*Very Good.* తెలివంటేనీదే తెలివి! అందుకనే యెప్పుడో 'బుద్ధికి బృహస్పతి వని' బిరుదుతమరికి.. .ఇవ్వబడింది ఆవిడ మళ్ళీ పిలుస్తున్నట్లుంది. వెళ్ళి చూచిరా ఏమిటో"

"వస్తున్నా" అంటూ రాధ వంటింట్లోకి పరుగెత్తింది.

ఆఫీసు గదిలోకివచ్చి కుర్చీలో కూర్చోబోతుంటేసరికి టంగ్ ! టంగ్ మని అయిదు గంటలు కొట్టింది.

"అరే! రే! అప్పుడే అయిదయిందే" అన్నా.

"మీ *Work* యెన్నింటి కేమిటి" అన్నాడు మాధవరావుగారు.

"సాయంత్రం ఆరుగంటలనుండి యెనిమిది గంటలవరకు"

"అయితే ఫరవాలేదులెండి ఇంకా గంట టైముందిగా."

"అబ్బే! స్నానం అదీ చేసేటప్పటికి ఈ గంట సరిపోదండి."

"ఈ వూళ్ళో మంచి సినిమాలేమన్నా వున్నయ్యాండి" అన్నారు రావుగారు.

"చూడాలేగాని మంచి సినిమాలు లేకేమండి" అన్నా విసుగ్గా.

అసలు నేను రాధ సినిమాకు వెళ్దామని వంట త్వరగా చేయిస్తే, ఇంతలో వీళ్ళు తయారు. చుట్టాలట! చుట్టాలు! అసలు వీళ్లకి *Manners* తెలియవు. అవతలవాళ్ళ కష్టాలు ఆలోచించరు. నా మటుకు నేను యేవూరువెళ్లినా, యెంతమంది మిత్రులు చుట్టాలూ వున్నా, హోటల్లోనే భోంచేస్తాను. ఒకర్ని కష్టపెట్టడం నాకసలు యిష్టముండదు. అటువంటి నాకు వీరందరూ యేమిటి? భగవంతుడి పరీక్షంటే ఇదే కాబోలు.

"ఇక్కడ లక్ష్మీటాకీస్‌లో యే సినిమా ఆడుతోందండి" అన్నాడు నా ఆలోచనలను చీల్చివేస్తూ.

"మల్లీశ్వరి అది చాలా బాగుంటుంది."

"అయితే మేము యివ్వాళ దానికి వెళ్తాము. రాధను కూడా పంపండి."

"...ఆ, అది రాదులెండి. అది కూర్చోలేదు" అన్నా నేలవైపు చూస్తూ.. ...

"ఇందాక అడగటం మరిచా మీతో వచ్చిన ఆ యిద్దరమ్మాయిలు మీ కుమార్తెలేనాండి." అన్నా.

"అవునండి" అన్నాడు రావుగారు.

"అయితే *Family* తో యేదో ముఖ్య విషయ ముంటేనేగాని తమబోటివారు బయల్దేరడం ." అన్నా అసంపూర్తిగా.

"అవును. అవును. వుయ్యూరులో మా తమ్ముని కుమారుని వివాహమైతే అక్కడకు వెళ్ళివస్తూ, నాలుగురోజు లుండిపోదాము, మళ్ళీ ఈ ప్రాంతాలకు యిప్పట్లో రాం గదా అని.. " అన్నాడు రావుగారు.

"అవును. దూరంనుండి రావడం..." అన్నా లోపల కోపమున్నా పైకినవ్వుతూ. ఇంతలోకి రాధ ఆఫీసుగదిలోకి వచ్చి అత్తయ్య రమ్మంటోందని రావుగారితో చెప్పింది. ఆయన లోపలకు వెళ్లేడు. ఆయనతో బాటు రాధకూడా లోపలకు వెళ్లింది.

అసలు వురిటికి వీళ్లందరుండి, రాధ వురిటిమంచంమీదవుంటే యిల్లంతా దుబారా చేస్తారు ఇదిగాక ఇప్పుడు బస్తా బియ్యం *Black Market* లో 80 రూపాయలమ్ముతోంది. వాళ్లు వురిటిదాకావుంటే కనీసం రెండుమూడు బస్తాల బియ్యమన్నా కావాలి. *Black* లో కొన్నామంటే మన నియమం నశించినట్లే మిత్రుడికి ద్రోహమా! చా! చ! యేమైనాసరే *Black* లో బియ్యం కొనను. మరి కొనకబోతే రేపటి నుండి బియ్యం యెట్లా? వీళ్లు రేపు వెళ్ళిపోతే నాకేమీ అవస్తుండదు. కాని వెళ్లరుగదా!...సరె! వీళ్ళని యెట్లాగయినా యిక్కడనుండి వెళ్లేటట్లు ప్రయత్నిస్తాను ఆ తరువాత యేమైతే అది. రాధకేం తెలుసు ప్రపంచంయొక్క వడవడిక. వట్టి అయాయకురాలు. అయినా చుట్టాలంటే దానికెందుకో అంత అభిమానం. దాని మనస్సటువంటిది. మళ్లా ఈ ప్రేమ వాళ్ళకుంటుందా-యే కోశానా వుండదు! చుట్టానికి బాగున్నవాడి నెత్తిన చేతులు పెడదామనేగాని వాడిని బాగుచేద్దామని ఆలోచన చస్తేవుండదు. మా తరఫువాడే అయితే వెళ్ళమని చెప్పేసేవాడిని అసలు మా తరఫువారికి నా సంగతి తెలుసుగా అందుకనే ముందుగానే జాగర్తగా వుంటారు మా వైపువారు. వీళ్ళకిమల్లే వచ్చి మకాం వేయరు ఇంతలోకే 'టంగ్!' మని అరగంట కొట్టింది. అరె! అప్పుడే అయిదున్నరయిందే. ఇక బయల్దేరాలి మొఖం రుద్దుకుని. హాల్స Inspection వుందిగా. నెమ్మదిగా వెళ్ళవచ్చునుకుంటే వీళ్ళొకళ్లు యింటినిండా చీదరగా. వంటింటినిండా ఆడవాళ్లే సిగ్గన్నాలేదు. కాళ్లు జాపు కూర్చున్నారు. ఇప్పుడు స్నానాలగదికి యెట్లా వెళ్లడం. అందుకనే అద్దెకు తీసు

కుసేటప్పుడు స్నానాలగది మార్పించండి అని ఇంటాయనతో చెప్పి మరీ యింట్లో ప్రవేశించా - ఆయన యేసెల కొసెల అద్దె ముందుగా వసూలు చేసుకోవడమే కాని అద్దెవాళ్ళ చిక్కులు వినడం ఆయనకు అనవసరమంట. చేరేటప్పుడు తియ్యగా మాటలు చెప్పడం. చేరినతరువాత అనవసరం. అందుకనే సొంతకొంప వున్నవాడి పని హాయి అన్నారు తెలిసిన పెద్దలు. ఇంకా కదలలేదు. యివ్వాళ వంటింట్లో నుంచి ఆడవాళ్ళు లేచేటట్లు లేరే!

"రాధా" అని గట్టిగా పిల్చాను.

"వస్తున్నా" అంటూ నాగదిలో ప్రవేశించింది.

"చుట్టాలువచ్చారని వాళ్లతోనే స్వర్గం మోక్షమైతే యెలా? కాస్త మాముఖం కూడా చూడు"

"అబ్బ! పోదురు. మీ కెప్పుడూ వేళాకోళాలు. ఎప్పుడూ ఇంతే"

"వాళ్ళతో సినిమాకటు వెళ్ళు అంత మోజుగలదానివి."

"వాళ్ళతోనా! నేను వెళ్ళను"

"యేం"

"నాకు మీతో తప్ప యెవ్వరితో వెళ్ళినా చీమలు, జెర్రెలుపాకినట్లుంటుంది"

"సరేగాని, ఉద్యోగానికి టైమయింది. కాళిని మొఖానికి నీళ్ళు, సబ్బు పారేస్తే చాలు. అక్కడ ఆడవాళ్లున్నారు, యేమనుకుంటారోనని యిందాకటినుంచి- ఇప్పుడు కూడా అటురా బుద్ధి కావడం లేదు"

"పాపం అంటూ ముఖంవంక చూస్తూ ఇంట్లోకివెళ్లి నీళ్లు సబ్బు తెచ్చింది మొఖం రుద్దుకుని తుండుగుడ్డకోసం నిల్చున్నా. అలవాటు ప్రకారం రాధవచ్చి మొఖం తుడిచివెళ్ళింది. తల దువ్వుకొని సైకిల్ బయటపెట్టేను; ఉద్యోగానికి పోవడానికి అప్పుడే టయిం ఆరు పది నిమిషాలైయింది. వెధవది శీతాకాలం పూర్తిగాపోయి వేసవికాలం పావువంతు ప్రవేశించినా యింకా సాయంత్రం దబ్బునే ప్రొద్దుగూకుతోంది ఇంతలోకి రాధవచ్చి సంచియిచ్చి "బజారుమీదు గావచ్చేటప్పుడు మంచి బంగాళదుంపలు 1 వీశెడు తీసుకు రండి" అంది



"చిత్తం! చిత్తం!" అంటూ సైకిల్ యెక్కేను.

## 2

"తలుపు! తలుపు" అని తలుపు కొట్టేను.

"వస్తున్నా"

"మీకేనా యింకెవరో ననుకున్నా" అంది రాధ తలుపుతీస్తూ.

"వారందరు లేరా? ఎక్కడకు వెళ్ళేరు?"

"మల్లీశ్వరి సినిమాకు వెళ్ళేరు.

"భోజనం చేసే వెళ్ళేరా"

"లేదు! వచ్చి భోజనంచేస్తామన్నారు"

"ఊ! వీళ్ళకి యిక్కడవడ్డన చేసేందుకున్నారని తేరగా మనుష్యులు"

"అబ్బా! యెందుకండి చుట్టాలంటే అంత విసుగు"

"విసుగుకాకపోతే యేమిటి! పచ్చగా వున్నప్పుడే వీరందరూ చీమలులాగా చేరేది. కష్టంలోవున్నప్పుడు ఒక్కళ్లూ రారు!

"మీచుట్టరికంలాగా అన్ని చుట్టరికాలుంటయ్యా, మీచుట్టాలు రుక్మిణమ్మగారు, విశాలక్షమ్మగారివలె పొడగిట్టని వాళ్లంటారనా మీవూహ."

"కాకపోతే, మీవాళ్లుమటుకు మహా పత్తిత్తులేమిటి"

"మీబంధుత్వంకన్న చాలా నయం. కాకిచేత కబురంపినా నిమిషాలమీద వచ్చి వాల్తారు

"అట్లాగా! సరే, మీ బంధువులు కూడా, మా బంధువుల మాదిరే ఆపదలో ఆదుకోరని రుజూచేస్తాను. మరి నాకేమిస్తావు"

"మీరలా యెప్పటికీ చేయలేరు" అంది సీరియస్ గా ముఖంపెట్టి

"చేస్తే" అన్నానవ్వుతూ.

"మీరలా చేయగలిగితే యెలాగైనా మానాన్నను ఒప్పించి మీచేతి గడియారానికి బంగారుగొలుసు కొనిపిస్తా" అంది గడియారం వంక చూస్తూ.

"ఓ! సరె" అన్నా సంతోషంగా.

"మరిమీరుఓడిపోతే?" అందిరోషంగా.

"నేను ఓడిపోతే యేం చేయాలో నీవే చెప్పేస్తే బాగుంటుంది"

"నాకు నెక్ లెస్ చేయించాలి."

"ఓ! తప్పకుండా చేయిస్తా."

"సరే"

"సరే"

"రేపే పందెం మొదలు"

"మరి నేను చెప్పినట్లు చేయాలి" అన్నా వేలు చూపిస్తూ.

"ఆ! చేస్తా" అంది.

ఇద్దరం అన్నం తిన్నాము. రోజూ అన్నం తినగానే పడుకోవడం నాకు అలవాటు ఇవ్వాళ వాళ్ళకోసమైనా చచ్చినట్లు పది గంటలదాకా మేల్కొని వుండాలి. నా పందెం గురించి ఆలోచిస్తున్నా. గంటలు, నిమిషాలు గిర్రున తిరిగిపోతున్నవి. అప్పుడే పదిన్నరయింది. ఇంతలోకే వాళ్ళు వచ్చారు. వాళ్ళు లోపలకు వెళ్ళిన తరువాత నేను తలుపు వేసి పడుకున్నా.

అనుకున్న ప్రకారం మొన్నాడు ప్రొద్దున రాధ నిద్రమంచంమీదనుండి లేవకుండా నొప్పులు పడ నారంభించింది. నేను వెళ్లి మంత్రసానిని తీసుకువచ్చా ఈ విషయం మంత్రసానితో ముందే చెప్పడం చేత అది వచ్చి పరీక్ష చేసి కాన్పు బహుశా సాయంత్రం రావచ్చంది.

"అయితే ఈ పూట అన్నం పెట్టమన్నారా" అన్నా.

"అడిగితే పెట్టండి. లేకపోతే పాలు యివ్వండి"

"...."

మంత్రసాని వెళ్ళిపోయింది. ప్రొద్దున్నె కాఫీలు. కాఫీ పరికరాలన్ని యెక్కడున్నయో చెబితే వాళ్లు కాఫీ కాచి నాక్కాస్త రాధకు కాస్తా పోస్తారుగా! అట్లా కాదుట! వాళ్ళు అవ్వన్నీ పాడు చేస్తారుట హోటల్ కి వెళ్లి కాఫీ తీసుకురమ్మంటుంది. సరే! యేం చేస్తాం అని కాఫీ; టిఫెన్ తీసుకువచ్చా. బిల్లు చూసేటప్పటికి నా గుండె ఆగిపోయినంత పనైయింది రెండురూపాయల పదమూడణాలే! చచ్చాం! అసలు వీళ్లొచ్చింది దేనికి? వొదిలించడానికేగా! ఇంతకీ వాళ్ళ ననవలసిన పని లేదు తొలి నేజేసిన. శివరావుగారు చక్కగా పాడేరు. ఆ పాట నాకు బాగా సరిపోయింది ఇప్పటి పరిస్థితులలో.

కాఫీలు అయ్యేటప్పటికే 8 గంటలయింది. నేను ఆఫీసుగదిలో కూర్చుని వ్రాసుకుంటున్నా రావుగారి ధర్మపత్ని సీతమ్మగారు రాధ గదిలో కూర్చుని పత్రిక చూస్తోంది వంటసంగతి దేముడికి తెలుసని గాముల్నా ఆవిడ వూహ! రావుగారు యేదో పనుండి బయటకు వెళ్ళేరు. ఎంతసేపటికీ కదలకపోవడం చూసి రాధ—

"అత్తయ్యా! కాస్త ఈ పూటకు మడి గట్టుకుంటావా! నాకు చూస్తే నొప్పులు తగ్గలేదు ఆయనకు పది గంటలకే అన్నం తినటం అలవాటు అందుకనే రోజూ

వంతైన తరువాతగాని యోపని చేయను" అంది

".. అట్లాగేనమ్మా" అంది రావుగారి ధర్మపత్ని, కొంచం ఆలోచించి.

## 3

ఉదయం పదకొండు గంటలయింది వేసవి కాలం అవడంవల్ల యండమాంచి తీక్షణంగా వుంది. మాధవరావుగారు, సీతమ్మగారు వంటింటో యేదో మాట్లాడుకుంటున్నారు. వంటింటికీ రాధ పడుకున్న గదికీ ఒక వరండాయే అడ్డం రాధ గదిలోకి వెళ్లి కొస్త ఫ్లాస్కులో కాఫీ త్రాగుతున్నా. రాధ నావంక చూచి నవ్వింది. తన పందెం గెలవబోతున్నాదని.

"సరేలే కాని యెవ్వరు గెలుస్తారో చూద్దాంగా" అన్నా నవ్వుతూ.

" ....... .. .. "

"ఏమిటి ఇవ్వాళ పదకొండు గంటలైనా కూకుకూడు లేదు. తమరికేం ఫ్లాస్కు దగ్గరుంది. హాయిగా శయనించారు. కడుపు నిండినవారికి ఆకలి బాధ యేం తెలుస్తుంది.. "

"మరి నే ననుకున్నారా, కొప్పడతారేమోనని భయపడేందుకు?"

"చాల్లే! తగ్గు అసలు యింతకీ ఆవిడ వంట చేస్తోందో లేదో"

"మరీ అంత అన్యాయం కాదులెండి" అంది ముఖం అదోమారిగా పెట్టి.

"అయితే పందెం గెలవబోతున్నా వన్నమాట!"

"ఆ" అని నవ్వింది.

ఇంతలో...

"అమ్మా రాధా! స్నానం చేయవచ్చు" అన్న పిలుపు వినబడ్డది.

"అమ్మయ్య యిప్పటికి బ్రతికాంరా" అనుకున్నా

భోజనమైంది. వక్కపొడి ఆయనకు కొస్త యిచ్చి నేను కొస్త వేసుకున్నా. రాధని కూడా భోంచేయమని చెప్పేను. నొప్పులతో బాధపడుతున్నట్టుగానే నటిస్తూ రాధ భోజనానికి వెళ్ళింది రావుగారు పేపరు చూస్తూ నాతో హాస్కు మొదలుపెట్టేరు.

"రాయలసీమలో కరువుని మన ఆంధ్రులంతా ఒక్కుమ్మడిగా ఆదుకోడమే గాక తక్కినవారు కూడా ఆదుకున్నారండి." అన్నాడు.

"అవును. అందుకనే యిప్పుడు కొంచం తగ్గుముఖం పట్టింది."

"ఈ సినిమా నటులు కూడా నడుం కట్టేరండి"

"ఇటువంటివాటికి వారు నడుం కట్టకపోతే యేమౌతుందండి. వేలు సంపాదించే లాయర్లు, డాక్టర్లు వారి స్వలాభాలు చూచుకోవడమేగాని యిటువంటివాటికి సహాయం చేయరు "

ఇంతలో అంటూ మంత్రసానిగారు ప్రవేశించారు.

"ఓ! రండి! రండి!" అన్నా.

"ఎల్లా వున్నయ్యండి నొప్పులు"

"లోపలున్నట్లుంది, చూడండి"

మంత్రసాని లోపలకు వెళ్లి మళ్లీవచ్చి-

"బహుశా రేపు ప్రసవం కావచ్చు" అంది.

"అయితే ఈ రాత్రికి ఫరావా లేదుగా అన్నా" "ఫరవాలే" దంది.

మంత్రసాని వెళ్లిపోయింది. "కొంచెంసేపు పడుకుంటాను మీరు కూడా పడుకోండ"ని చెప్పి, గదిలోవున్న మడతమంచం వాల్చుకుని, నిద్ర పట్టక తెలుగు పత్రిక చూస్తున్నా. రావుగారు, ఆయన ధర్మపత్ని వంటింట్లో కాసేపేదో గుడగుడ లాడుకున్నారు. కొంచం సేపటికి మాధవరావుగారు నాదగ్గరకు వచ్చి కుర్చీ దగ్గరకు లాక్కొని,

"మోహన్‌రావుగారు" అన్నాడు.

"ఆ" "నిద్ర పట్టినట్లుంది" "లేదండి"

"మేము సాయంత్రం మూడు గంటల బండికి గుడివాడ వెళ్తున్నాము" అన్నాడు.

"అరె! అప్పుడే వెళ్తారా! ఇంట్లో

దానికి చూస్తే రేపు ప్రసవమౌతుందని మంత్రసాని చెప్పింది. నాలుగురోజులపాటుంటూ రనుకుంటే..." అన్నా అసంతృప్తిగా.

"అవునవును. వుండవలసినవాళ్లమే. మా రెండవ అమ్మాయికి గుడివాడలో సంబంధం చూడాలని వుంది కుర్రవాడు ఇంకా రెండురోజులే యింటిదగ్గర వుంటాడుట. తరువాత అతనికి కాలేజీ వుందిట."

వీరి రెండోఅమ్మాయిని నా స్నేహితుని కివ్వడానికి నిశ్చయించుకున్నారనీ వివాహం ఇంకా అయిదు నెల లుందని నా స్నేహితుడే ప్రొద్దున చెప్పేడు. నేను ఈ సంగతి ఆయనతో యెత్తకుండా పైకి "ఓహో!" అన్నా.

"అందువల్లకాని లేకపోతే, ఈనెల రోజులు సదుం కట్టుకుని వుండేవాళ్ళం కాదా! అమ్మాయిని ఈ స్థితిలో విడిచిపెట్టి వెళ్ళటం మాకు రోమాత్రం యిష్టంలేదు."

"మామగారు! మీరట్లా అంటం రేమీ బాగాలేదు. మీరు కావలిస్తే ఆ సంబంధం చూడటం, నిశ్చయించడం నే చేస్తాను. మనిద్దరం వెళ్దాము కాని మీరు మాత్రం తప్పకుండా వుండిపోవాలి"

ఈమాటలు వినేటప్పటికి రావుగారు కొంచం మెత్తపడ్డాడు. చచ్చాంరా ఇక మన పందెం ఓడినట్లే. అనుకున్నాను. ఇంతకీ నెక్లెస్ చేయించవలసిన రోజు వచ్చింది. నెక్లెస్‌కి యెంతవుతుందో అని ఆలోచిస్తున్నా. ఇంతలోకే రావుగారి భార్య ఆయన్ని పిలవడంవల్ల రావుగారు లోపలకు వెళ్లేరు

అరె! అరె! చివరదాక వచ్చిన పందాన్ని కొంచంలో పాడుచేశానే. అయిపోయిందానికి యేంచేస్తాను, అని ఆలోచిస్తున్నా. ఇంతలోకి రావుగారు నాదగ్గరకు వచ్చి-

"మా ఆడవాళ్లుకూడా అబ్బాయిని చూడాలనంటోంది. ఈ సాయంత్రానికి వెళ్ళి రేపొస్తాము" అన్నాడు

"సరే! మీయిష్టం"అన్నా భారమంతా ఆయనమీద వేసినట్లు. రాధ గదిలోకి వెళ్లి

"అమ్మాయి రాధా! వెళ్లి మళ్లీ రేపొస్తాముమ్మా, కాస్త యివ్వాళకు ఓపికపట్టు" అన్నాడు.

"అదేమిటి మావయ్యా! అత్తయ్య నన్నా వుంచు. నాస్థితిచూచికూడా ఇలా వెళ్ళేవని తెలిస్తే నాన్నకు కోపం వస్తుంది" అంది, అలాంటే వుంటారని

"అవునమ్మా! నాకు తెలుసు. కాని ఆ సంబంధం గోడవకూడా యిప్పుడే వచ్చే,

"ఈ సంబంధ మొక్కటేనా ప్రపంచంలో. ఇది కాకపోతే యింకొకటి చూడవచ్చు. నా స్థితి చూచికూడా......"అంది

"అమ్మా! నీస్థితి నాకు తెలుసమ్మా. సంబంధాలు యెక్కడా దొరకడంలేదు. వున్న సంబంధాన్ని చేతులారా ... రేపు ఈపాటికియిక్కడుండకపోతే అప్పుడను."

"సరే మీయిష్టం" అంది వస్తున్న కన్నీటిని ఆపుకుంటూ.

రావుగారు బయటకు వెళ్లి నాలుగు సైకిల్ రిక్షాలు తీసుకువచ్చారు. రావుగారి ధర్మపత్ని పిల్లలతో ముందుగానే రిక్షా యెక్కి కూర్చుంది. రావుగారు రాధ గదిలోకి వెళ్ళి,

"వెళ్ళొస్తామమ్మా" అన్నారు.

"మంచిది" అంది ముక్తసరిగా.

నాదగ్గరకు వచ్చి రావుగారు-

"వెళ్ళొస్తామండి. యేమీ అనుకోవద్దు. పరిస్థితులట్లా వచ్చినవి." అన్నాడు నా రెండుచేతులూ పట్టుకొని.

మౌనంగా తల వూపేను.

"వెళ్ళొస్తామే రాధా" అని బజారులో నుండే కేక వేసింది రావుగారి ధర్మపత్ని.

రిక్షాలు వాయువేగ మనోవేగంతో సందుమలుపు తిరిగినై. నేను రాధ గదిలోకి వెళ్ళేను.

"ఏమిటి విశేషాలు! పందెం గెల్చేవే" అన్నా గర్వంగా.

"వెక్కిరించక్కర్లేదు లెండి" అంది రోషంగా.

"ఇప్పటికైనా చుట్టాలంటే అర్థమయిందా? ఇవ్వాళ నీకు నిజంగా నే నొప్పులు వచ్చివుంటే యేమయ్యేది. దూరపు బంధుత్వమంతా యింతేననుకో. ఆపదలో ఆదుకునే చుట్టాలు చాలా తక్కువ. ఇప్పుడు మనం ప్రత్యక్షంగా చూచాముగా!"

రాధ మౌనంవహించింది రోషంతో మాట్లాడినప్పుడు రాధ కళ్ళచివర కారిన నీళ్లు తుడిచాను.

ఆ మర్నాడే రాధచేత పందెం విషయం మా మామగారికి వుత్తరం వ్రాయించాను. మూడవ రోజు కల్లా నాగడియారానికి బంగారు గొలుసు వచ్చింది. కాని మాధవ రావుగారు అప్పటికీ యిప్పటికీ అంతులేరు. ఇలా వుంటై నేటి చుట్టరికాలు. . ★

# రెండు మహానగరాలు

(13-వ పేజీ తరువాయి)

నాదికాదు—నీ రహస్యాన్ని గౌరవిస్తాను—వాగ్దానం చేస్తున్నాను.'

'భగవంతుడు నిన్ను ఆశీర్వదిస్తాడు—వెళ్లొస్తాను'

లూసీ అరచేయి పెదవులకు హత్తుకుని, లేచి, ద్వారంవేపు నడుస్తున్నాడు.

'ఈ ప్రసక్తి మళ్లా యెప్పుడేనా ఎత్తుతానేమో అనుకోకు లూసీ! ఎన్నడూ ఈ ప్రసక్తి మళ్లా రాదు నే నిప్పుడు వెంటనే మరణించితే ఈ రహస్యం ఇక్కడితో ఎలా అంతరించిపోతుందో, అలాగే అంతరించిపోయిందనుకో—నీతో ఈ కాసేపూ ముచ్చటించటంవల్ల కలిగే ప్రయోజన మేమిటంటే—నాకు మృత్యువు ఆసన్నమైనప్పుడు, నా పతితహృదయంమీద నీ మనస్సులో జాలివున్నదనే మనశ్శాంతితో ప్రాణాలు విడుస్తాను'

ద్వారంలోనుంచి నిష్క్రమించబోతున్న ఆ దీనమూర్తిని చూసి, లూసీ పేగులు బాధగా కోసుకుపోయినై అరచేతిలోముఖం కప్పుకుని వలవలా యేడిచింది. అతను వెనక్కి తిరిగిచూచాడు.

'కలవరపడకు లూసీ! అలాంటి కరుణకు పాత్రుణ్ణి కాదగిన యోగ్యత లేవీ నాలో లేవు. ఒకటి రెండు గంటల్లో నీచాతి నీచంగా సంచరిస్తూ, నీచాతి నీచులైన లోఫర్లతో కలిసి తప్ప దాగి తూలుతూ నేను బజార్లవెంట తిరుగుతుంటే, అలాంటి జాలికీ, కరుణకు పాత్రుణ్ణి కాదని తెలుసుకుని విస్తుపోవలసి వస్తుంది. నాకోసం అలా బెంబేలుపడకు కాని నా మనస్సులో నీ మూర్తి యెప్పుడూ మెసులుతూనేవుంటుంది. ఈ సంగతి ఒక్కటీ జ్ఞాపకం పెట్టుకోమని మాత్రం కోరుతున్నాను.'

'తప్పకుండా జ్ఞాపకం పెట్టుకుంటాను సిడ్నీ'—

'మరొక తుదిమాట చెప్పిపోతాను—ఈనాటితో నీ సముఖానికి రావటం మానివేస్తున్నాను ఇది ఇప్పుడు చెప్పటం అప్రస్తుతమైనా నా మనస్సు చెప్పమంటోంది చెబుతున్నాను. నీ కోసం, నీ హృదయానికి ప్రియతముడైన వ్యక్తికోసం నేను ఏ త్యాగమైనా చెయ్యగలను. నా జీవితంలో అలాంటి అదృష్ట లేశమేదైనా వుండి, నాకు అలాంటి త్యాగం చెయ్యగల సావకాశం లభిస్తే మీ కోసం అమిత ఆనందంతో నేను మృత్యువును ఆలింగనం చేసుకుంటాను. నీవు ఆనందంతో మునిగితేలుతున్నప్పుడు అప్పుడప్పుడు కాస్త నన్ను జ్ఞప్తిలో వుంచుకో—నీకు ప్రేమపాత్రుడైన వ్యక్తిని రక్షించటానికి తన ప్రాణాన్ని త్యాగంచెయ్యగల వ్యక్తి ఒక డున్నాడని అనుకో సెలవు'—అతనిపాదాలు ద్వారంలోనుంచి బయటనున్న అంధకారంలోకి నడిచిపోయినై

★




# భయమంటే....!



శ్రీ జి. వి. జి. కృష్ణ

బిక్కవోలనే గ్రామములోనా
తిక్కపంతులొకడుండేవాడు.
దయ్యాల్ భూతాల్ ఏవీ లేవని
భయమే లేదని ఆతనివాదన.

పంతులి పల్కులు నమ్మలేని ఒక
చాకలి అన్నాడిల్లాగ :
"చదువుకున్న మీరే ఇట్లంటే
భూతాల్ దయ్యాల్ ఏమైనట్లు ?"

ఎంత సేపటికి లేవను చుండిన
"పంతులుపైనా కోపం కలిగి
పందె మ్మొక్కటి మనకిద్దరికీ
అందుకు మీరూ ఒప్పెదరా"

అనగా పంతులు అన్నాడిలాగ:
"అయితే ఏమిటో పడవోయ్
భయాలు దయ్యాల్ ఏవీ లేవని
ప్రజలందరికీనే తెలిపిస్తా."

"వల్లకాటికీ అర్ధరాత్రిలో
చీలనొకటిని తీసుకు వెళ్లి
చింత చెట్టుపై ఆనవాలుగా
చీలనుకొట్టి క్షేమంగా..." అని

చాకలి చెప్పకముందే పంతులు
"ఓస్ ఇంతేనా — కానీవోయ్" అని
లోలోపల భయమున్నానూ
పైకిమాత్రం గర్జించాడు.

సాక్షుల ఎదటా అర్ధరాత్రిలో
చాకలి పంపగ పంతులుగారు
బెదురుతు బెదురుతు వల్లకాటిదరి
మెల్లిగ మెల్లిగ చేరాడు.

అయ్యేదేదో కానీ అనుకొని
అరచేతిలొ ప్రాణాలుంచుకొని
కళ్లు మూసుకొని చింతచెట్టుపై
చీలను పెట్టి కొట్టాడు

సంతోషంతో మరలిపోవగా
పంచెను ఏదో వెనక్కు లాగగ
భూతమొ దయ్యమొ యని భయపడియా
పంతులు తెలివితప్పి పడిపోయాడు.

తెల్లవారగా చాకలివచ్చి
పంతులుగారూ పడిఉండటమూ,
పంతులుపంచా చింత చెట్టుపై
చీల కిరుక్కొని ఉండుట గాంచి.

"పంతులు పంచను చీల లాగగా
భూతమొ దయ్యమొయని భయపడి
తెలివి తప్పిపడి ఉండొచ్చని
అసలు సంగతిని ఊహించాడు.

నీళ్లు చల్లగా మెలకువ వచ్చిన
పంతులుగారూ ఇప్పటికీ
భూతాల్ దయ్యాల్ లేకున్నా
భయాలుమాత్రం ఉంటా" యంటాడు.

నాస్నేహితులలో రామారావు ఒకడు. మా అందరికి ఆ పిచ్చిలేదు కానీ, అతనికిమాత్రం అది మహా ఎక్కువగా వుంది. ఎవరెన్ని చెప్పినా వినడు. ఇప్పటికే చాలా డబ్బు తగలేశాడు. ఎప్పటికేనా రాకపోతుందా అని అతని ఆశ. వాళ్ళయింట్లో శతపోరారు. వింటేగా! 'పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతోగాని పోదు' అంటారు నిజమేననిపిస్తుంది. అప్పు కూడా చేశాడు!



# అదృష్టం వుందోబ్బా

శ్రీ. ఎస్. ఆర్. రఘువంశాచార్య

రామారావు ఫిఫ్తుఫారం చదువుతున్నాడు. మేమందరము అతనికి కో'స్టూడేంట్సు.' అందరం ఒకే లాడ్జిలో వుంటున్నాము. మా అందరిలోకి రామరావుకే ఎక్కువ మార్కులు వస్తూవుంటాయి. రామారావు తల్లితండ్రులు ఏమంత డబ్బున్నవారుకారు. సామాన్యకుటుంబీకులు. రామనాథంగారు (వాళ్ళ నాన్న) వుత్తమమయిన వుపాధ్యాయపదవిని నిర్వర్తిస్తున్నారు. ప్రయివేట్లు, జీతంకలిపి నెలాఖరున మొత్తం 120 రూపాయిలు సంపాదిస్తున్నారు. అందులో 40 రూపాయిలు రామారావుకు పంపుతారు. మిగతా రూ. 80 తోటి రామనాథంగారు, భార్య, యిద్దరు పిల్లలు బ్రతకాలి. అలాగే కష్టపడుతున్నారు.

రామారావు మొదట యీవూరులో ఫోర్తుఫారంలో జాయిను అయాడు. (తండ్రిగారి వూరిలో థర్డుఫారంవరకే వుంది. అది ప్యాసవగానే యీవూరు పంపేరు పైచదువుకి ) ఫోర్తుఫారం సాఫీగా గడచిపోయింది. ప్యాసు అయాడు. ఇప్పుడు ఫిఫ్తుఫారంలో జాయిన్ అయాడు. ఫోర్తుఫారం అయాక యిచ్చిన మూడునెలల వేసవి శలవులు వృథాగాగడపడం యిష్టంలేక, పబ్లికులైబ్రరీకి వెళ్ళి ఏవో పుస్తకాలు చదివాడు. ఆఖరినెల అతని దృష్టి పజిల్సుమీదికి పోయింది. ఏదో వో రూపాయిపెట్టి పజిల్ కట్టాడు. కీసాల్యూషన్ కొరకు ఎదురు చూశాడు. కీసాల్యూషన్ వచ్చింది. తనవి మూడుతప్పులువొచ్చాయి. నాలుగు రూపాయిలు ప్రైజు వచ్చింది. ఈలోగా శలవలు ఆఖరవడం తను యీవూరు రావడం జరిగాయి.

(34-వ పేజీ చూడండి)



బొమ్మరిల్లు సీరియల్

# డాన్ క్విక్సెట్

## పూర్వకథ

లామంచా అనే గ్రామానికిచెందిన డాన్ క్విక్ సెట్ అనే వెర్రి వెంగళప్ప ఒకడు తనుకూడా ఒకవీరుడు (నైట్) గా పేరుపొందాలని వుబలాటపడి, 'రోజినాన్‌టీ' అనే ఒక కుంటిగుర్రాన్ని ఎక్కి బయలుదేరాడు. ఒకానొక స్త్రీమూర్తిని ఎంచుకొని ఆమెకుతానే 'డల్‌సీనియా' అనేపేరు పెట్టుకొన్నాడు. ఆమెమన్నన సంపాదించటం కోసమే తాను ధర్మరక్షణమనే కఠోరదీక్ష స్వీకరించానని నమ్మాడు.

ఏవేవో వెర్రివెర్రి ఆశలుచూపి శాంకోపాంజా అనే ఒక అమాయకపు కూలీని తన బంటుగా చేసుకొన్నాడు వాడు 'డాపుల్' అనే ఒక గాడిదనెక్కి యీయన వెనకాలే బయలుదేరాడు. ఒకటి రెండు చోట్ల డాన్ క్విక్ సెట్ ఏవేవో సాహసకార్యాల చేయబోయాడు. ప్రతిసారి చావుదెబ్బలు తిన్నాడు.

ఒకరోజు ఒకమైదానంలో వీరి విడిసివుండగా 'రోజినాన్ టీ' ఒక గుర్రాలమందలో కలియబోయింది. ఆ గుర్రాలను కాచేవాళ్లు దీన్ని కొట్టారు. డాన్ క్విక్ సెట్, శాంకోపాంజావాళ్లమీద కలియబడ్డారు. వాళ్లు దుడ్డుకర్రలతో వీళ్లిద్దరికీ దేహశుద్ధిచేసియించారు.

ఆ స్వామీ, యీ బంటూ కొంతదూరం అలా ప్రయాణమై వెళ్లారు. డాన్‌క్విక్ సెట్‌గారి వళ్లు దెబ్బలతో పచ్చిపచ్చి అయిపోయి, ఆయనకు గుర్రంమీద కూర్చోవటానికీ కుదరలేదు; కాలు కదిపి నడవటమూ చేతకాలేదు ఇక యిది పనికాదని - ఏ దెబ్బలూ తిన కుండా వున్నది ఆ గాడిద ఒక్కటే కాబట్టి, దాని వీపు మీద అడ్డంగా పడుకొన్నాడు. గాడిద పొట్టకు ఒక వైపున కాళ్లు, యింకోవైపున తలా వేలాడేటట్లుగా పడుకొని ప్రయాణం కొనసాగించాడు.

ఉండివుండీ ఆ ముసలిగుర్రం పెద్దగా సకిలించ సాగింది. పాపం! దానికి ఎంత పెద్దదెబ్బలు తగిలాయో ఏమో! డాన్ క్విక్ సెట్‌కు మాట్లాడేందుకు కూడా ఓపిక లేకుండాపోయిందికాబట్టి కానీ, లేకపోతే, ఆ గుర్రంపై ఆయనకుగల అభిమానానికి, దాన్ని తన మూపున ఎక్కించుకు, తానే గుర్రంలా, తన గుర్రమే రౌతులా దౌడుతీసేవాడే! శాంకోపాంజా తన బుర్ర వుపయోగించి ఆ గుర్రాన్ని తన గాడిద తోకకు కట్టాడు కాబట్టి, ఆ గుర్రం అంతమాత్రమైనా కదల గలుగుతున్నది

శాంకోపాంజా కూడా ఆ కాపరుల చేతిలో దెబ్బలుతిన్న ఘటమేనేమో-వాడికీ ఏమిటో మతిపోయి నట్లే వుంది. తన స్వామిని చూడబోతే - ఆయన ఆ వరసను కూర్చోలేక, నిల్చోలేక నడుములు విరిగిపోయి, నానాయాతన పడుతున్నాడు; పోనీ ఆ 'రోజినాన్‌టీ'ని చూద్దామా అంటే, నోరులేని జీవం, దానికి ఎన్ని ఎముకలు విరిగాయో ఏమో, తడవతడవకూ తన గాడిదకంటే మిక్కుటంగా ఓండ్రపెట్టుతున్నది. ఎవరి విషయం చూసినా యింత నిరాశాజనకంగా వుంటే, శాంకోపాంజా తనకు తగిలిన దెబ్బలవిషయం



అనువాదం: శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తి

మర్చిపొమ్మంటేమాత్రం ఎలా మరిచిపోగలడు - వాడి మొఖం!

అలాగే భారంగా అడుగుతీసి అడుగు వేస్తూ తన గాడిదను నడిపించుకుపోతున్నాడు. అలా పోగా పోగా, కొంతసేపటికి బాగా చీకటిపడిపోయింది. కన్ను పొడుచుకొన్నా ఎదురుగా ఏమున్నదీ కనుపించటం లేదు. కీచురాళ్లు, యిలకోళ్లు ఒకటే 'గీ'పెట్టి అరుస్తు న్నాయి. దూరంగా చెట్లతోపుల్లోనుంచీ నక్కలకూతలు వినవస్తున్నాయి. గుడ్లగూబలు రెక్కలు తపతపకొట్టు కొంటూ రకరకాలైన శబ్దాలు చేస్తున్నాయి. తాము వున్న పరిస్థితీ, యీ అయోమయవాతావరణం యిదీ చూస్తే, శాంకోపాంజాకు పెద్దగా గుక్కపట్టి ఏడ్చేద్దా మన్నంతదిగులు ఒక్కమారుగా పుట్టుకొచ్చింది. కానీ-వీరుడితో తిరుగుతూ వున్నందువల్ల, వీడికి కూడా, వచ్చే ఏడ్పును ఆపుకోవటంలోనే గొప్పతనం వున్నదని పించింది. గుటకమీద గుటకగా గుటకలు మ్రింగి, పెద్ద ప్రవాహంలా వస్తున్న ఏడ్పును గొంతులోనే ఆపివే శాడు. ఏడ్పు అయితే ఆగింది కానీ, కడుపులో ప్రేగులన్నీ తెంచుకు బయటకువస్తున్నంత హడావుడిగా ఎక్కిళ్లు లక్కించుకొన్నాయి త్రాగేందుకు యిన్ని నీళ్లైనా దొరికితే బాగుండుననుకొని నాలుగువేపులా కలియచూశాడు.

అటువైపు, ఆ చెట్ల గుబురుల్లోనుంచి మిణుకు మిణుకు మంటున్న దీపాలు కనుపించాయి. ఏ కీకా రణ్యంలో యిరుక్కుపోయామోనని యింతసేపూ లోలోపలనే బెగ్గటిల్లిపోతున్న శాంకోపాంజాకు, యీ దీపాలను చూసేసరికి, ప్రాణాలు లేచివచ్చి నట్లైంది. ఆ దీపాలు కనిపించేచోట ఎవరైనా మను ష్యులు వుండకపోతారా, వారిని అడిగి యిన్ని మంచి నీళ్ళు అవీ పుచ్చుకు యీ రాత్రికి గడపలేక పోతామా అని ఆశపడ్డాడు. ఆ ఆశతోనే, లేనిపోని సత్తువ తెచ్చు కొని, గాడిదను మరికొంత వేగంగా నడిపించాడు.

దీపాలు దగ్గిరపడ్డాయి. కొంచెం ఎత్తైన గోడ లున్న యింటిలోనుంచీ యీ దీపపు కాంతులు వస్తున్నట్లు తోచింది. ఆ గోడలు, ఆ దీపాలు ఏమిటై వుంటాయో అని డాన్‌క్విక్‌సెట్, శాంకోపాంజా యిద్దరు మెడలు ముందుకు చాచి పరీక్షగా చూశారు.

శాంకో పాంజా కంటికి అదిఒక హోటల్‌లా తోచింది. డాన్ క్విక్‌సెట్‌గారికి మాత్రం అది ఒక కోటఅయి వుంటుందనిపించింది. శాంకోపాంజా సవినయంగా చెప్పాడు—అది కోటకాదని. డాన్ క్విక్‌సెట్ అటు వంటి మాటలు ఏవీ వినదలుచుకోలేదు. అది కోట అంటే కోటేనని పట్టుపట్టాడు. ఈయనను ఎలాగైనా ఒప్పించి, అది కోటకాదనీ, మామూలు హోటలేనని ఆయనకు బోధపడేటట్లు చెయ్యాలని శాంకోపాంజా ఎంతో తంటాలు పడ్డాడు. వీరుల లక్షణమంటే ఏమిటో వీడికి యిలాగైనా బోధపరుద్దామనీ, కట్టెదుర కనుపించే ఆ కట్టడం కోటేనని వీడిచేతకూడా ఒప్పింతామని డాన్ క్విక్‌సెట్‌గారు అంతకంటె ఎక్కువ తంటాలు పడ్డాడు. వీళ్లిద్దరూ ఎవరి పట్టుదల వారు విడవకుండా ఆ కనుపించేది హోటలేనని వాడు, 'కాదు; కోటే'నని యీాయనా, బిగ్గరగా వాదించుకొంటూ ప్రయాణం సాగించారు.

నిజానికి అది హోటలే! వాళ్లిద్దరూ యిలా బిగ్గరగా వాదించుకోవటం ఆహోటల్ యజ మానికి వినిపించింది. ఏదో బేరం తగిలేటట్లు వున్న దన్న ఆశతో, ఆయన చేస్తూ చేస్తూ వున్నపనికాస్తా వదలివేసి గబగబా వీధిలోకి వచ్చి చూశాడు.

దణ్ణెంమీద వేలాడవేసిన గుడ్డమాదిరిగా గాడిద వీపుమీదినుంచి వేలాడుతున్న డాన్ క్విక్ సెట్‌గారి అవతారం చూసేసరికి అతనికి ఆశ్చర్యం వేసింది. ఈయన కేదైనా రోగంవచ్చి అలా వున్నా డేమోనని అనుకొని, యీాయనకు వచ్చిన వ్యాధి ఏమిటని శాంకోపాంజాను అడిగాడు.

గుర్రపువాళ్ల చేతుల్లో తాము దెబ్బలు తిన్న వైనం యీాయనకు చెప్పటానికి శాంకోపాంజాకు తగని నామోషీ వేసింది. అందుకని అసలు విషయాన్ని బయట పెట్టకుండా, తన యజమాని అంత ఎత్తు కొండమీదినుంచి కాలుజారి క్రిందకు దొర్లాడనీ, అలా పడటంలో ఆయన వంటిపై అక్కడక్కడా పదు నైన రాతిమొనలు గీసుకుపోయి, గాయాలు తగిలా యని బొంకేశాడు.

ఈ మాటలు ఎక్కడనుంచి విన్నదో ఏమో— ఆహోటల్ యజమాని భార్య బయటకు పరుగెత్తు

కొంటూ వచ్చింది. ఆవిడగుండె అసలే జాలిగుండె. పాపం! యీ పెద్దమనిషి ఎవరో అంత ఎత్తు కొండ మీదనుంచి కాలుజారి పడి, వళ్లంతా గాయాలు చేసుకొన్నాడంటే ఆవిడకు కళ్లనీళ్ల పర్యంతం అయింది. దబదబా పోయి తన కూతురునీ, ఇంట్లో పనిచేసేదాసీని పిలుచుకువచ్చింది. వీళ్లందరూ కలిసి, తలాఒక చెయ్యివేసి, గాడిద వీపుమీద వేలాడపడిపోతున్న యీవీరుణ్ణి నింపాదిగా దించారు. ఆ గాడిదకు బరువు తగ్గించారు.

ఆ ఆడవాళ్లు ముగ్గురూ కలిసి ఆయనను అలా యింట్లోకి తీసుకెళ్లారు. ఆ యింట్లోకల్లా కాస్త మసలటానికి వీలున్నచోటు, క్రిందిబారుగావున్న అటక ఒక్కటే దానిమీదికి యీవీరుణ్ణి—అవకాయ జాడీ అటకమీదకు ఎక్కించినంతపదిలంగా—ఎక్కించారు. ఆవిడ వంటయింట్లోకిపోయి, గూళ్లుఅన్నీ గాలించి మందుడబ్బా ఏదోపట్టుకు వచ్చింది. కూతురూ, తనూ, ఆ దాసీ ముగ్గురూకూడా అక్కడే నిలబడి, డాన్ క్విక్ సెట్ గారి వంటిమీద ఎక్కడెక్కడ గాయాలు తగిలిందీ వెతికి యింతింత మందు పట్టించటం మొదలు పెట్టారు. వెతికినకొద్దీ గాయాలు కనిపించాయి. గాయాలు కనిపించినకొద్దీ వీళ్లు మందు దట్టించారు. గాయాలన్నిటికీ మందు పట్టించటం పూర్తి అయ్యేసరికి డాన్ క్విక్ సెట్ గారివళ్లు, మందుడబ్బాలో ముంచి పైకితీసినచందాన తయారు అయింది.

మందు పట్టిస్తూవుండగా ఆవిడకు ఎందుకు అనుమానం తోచిందో ఏమో — "నాకు చూడగా యీయనకు తగిలిన దెబ్బలు, ఏదో పెద్ద రోకలితో పోటువేస్తే తగిలే దెబ్బల్లా కనుపిస్తున్నాయి కానీ, కొండమీదినుంచి కాలుజారితే తగిలేవాటిలా కనుపించటం లేదే!" అంటూ ఆశ్చర్యం వెళ్లబుచ్చింది.

అసలు రహస్యం ఎక్కడ బయటపడిపోతుందోనన్న తొందరకొద్దీ, శాంకో పాంజా వెంటనే కల్పించుకొని "చూడండి, అమ్మా! ఈయన ఎక్కిన కొండ సామాన్యమైనదనుకొంటున్నారేమో! అబ్బే! ఆ కొండ అల్లాటిదిల్లాటిది కాదు, అంత ఎత్తు కొండ. ఆ కొండనిండా రాళ్లే. ప్రతిరాయీ—మూశారూ—మన యీటెమొనలాగా,—మొనలు తేలి, బలే పదునుగా వున్నదంటే నమ్మండి. అందులోనూ యీయన అంత ఎత్తునుంచి కాలుజారిదొర్లారేమో—ఆయన క్రిందపడేలోగా, ఆకొండలో వున్న ప్రతి రాతి మొనా యీయన వంటికి గీరుకుపోయింది. అబ్బ! ఆ దృశ్యం నే చూడలేకపోయాను; అది తలుచుకొంటే నాకు యిప్పుడు ఏడుపువస్తుందిసుమండీ!" అంటూ చేతులు మొఖానికి అడ్డంగా పెట్టుకొన్నాడు.

అలా ఒకటి రెండు నిముషాలు గడిచాక, చిర్రునచీది, లప్పెడు తీసి అక్కడే నేలమీద విసిరి వేసి, ఎడంచేత్తో ముక్కు తుడుచుకొని, "అమ్మా! ఆ మందు యింకా మిగిలితే నాకు కూడా కాస్త యిప్పిద్దురూ" అన్నాడు, ప్రార్థనాపూర్వకంగా.

ఇతడు యీమాట అనేసరికి, అంత సేపూ అటు తిరిగి డాన్ క్విక్ సెట్ గారి వంటిమీద మందు పట్టిస్తున్న ఆమె, యిటు తిరిగి "అదేమిటీ! నువ్వు కూడా ఆ కొండమీదనుంచి పడ్డావా; ఏం?" అని ఆత్రంగా అడిగింది.

"ఎబ్బే! లేదండీ! ఏమిటో—ఆయన అంత పాటు పడితే, నాకూ యీ ప్రక్కలన్నీ డొక్కుపోయి నట్లే వున్నది. ఆయనఅవస్థ చూస్తుంటే నామటుక్కు నాకు, నావంటిమీద వేయి గాయాలు తగిలినంత బాధ గానూ, నలుపుగానూ వున్నదండీ," అని సమాధానం యిచ్చాడు, శాంకో పాంజా. ఈ సమాధానంతో ఆ అమాయకురాలు సంతృప్తిపడినట్లే కనుపించింది. దాసీదానిచేతికి ఆ మందు డబ్బా యిచ్చి, ఆయన వంటికికూడా మందు ఘట్టించమని పురమాయించింది. ఆయింటివాళ్లు వీళ్లిద్దరికీ చెయ్యగలిగినన్ని వుపచారాలుచేసి, యిక కాసేపు విశ్రాంతిగా ఆ గడ్డి పరుపులమీద పడుకోమని చెప్పి, వాళ్లుకూడా పోయి పడుకొన్నారు.

అసిలి సొలిసిన ప్రాణాలవటంచేత యిద్దరికీ వెంటనే కునుకుపట్టింది. అప్పుడు పడుకోవటం పడుకోవటం, తెల్లవారుఝామున కానీ యిద్దరికీ మెళుకువ రాలేదు. డాన్ క్విక్ సెట్ కళ్ళు తెరిచి చూసేసరికి శాంకోపాంజా పక్కమీద కూర్చొని ఆవలిస్తున్నాడు. అవీ, యివీ కబుర్లు ఆడుకొన్నాక, డాన్ క్విక్ సెట్ కు ఒక ఆలోచన వచ్చింది. మామూలుగా వీరులకు ఏవైనా దెబ్బలు అవీ తగిలితే, వాళ్ళే ఏదో మూలికలు, పసరులు తయారుచేసుకొని, వాటితోనే అవన్నీ మాన్పుకొన్నట్లు డాన్ క్విక్ సెట్ చదివిన పుస్తకాలలో చెప్పబడి వున్నది. తనూ ఒక వీరుడే. తనకూ యిప్పుడు గాయాలు తగిలాయి. వాటికి మందు వేసుకోవాలంటే వాళ్ళు వీళ్లు యిచ్చేమందులు పనికి రావని అతనికి తోచింది. అందుకని తానే ఒక దివ్యౌషధం కనిపెట్టాలనే బుద్ధిపుట్టింది. శాంకో పాంజాతో నెమ్మదిగా యీ విషయం చెప్పి, ఆహోటల్ యజమాని వద్దకుపోయి యింత సారా, వుప్పు, మంచి నూనె, దవనం మొక్కలూ వగైరా పట్టుకు రమ్మన్నాడు.

యజమాని చెప్పిన ఏపనిఅయినా సరే, చెయ్యననే తత్వం శాంకోపాంజాలో సుతరామూ లేదుగా! తన వళ్ళు ఎంత స్వాధీనంలో లేకపోయినా, వాడు వెంటనే ఆ హోటల్ యజమానివద్దకు పోయి ఆయన చెప్పినదినుసులు అన్నీ పట్టుకువచ్చాడు. డాన్ క్విక్ సెట్ గారు ముక్కుతూ మూలుగుతూ అట్లాగే లేచి పక్కమీద కూర్చొని, వాడు తెచ్చిన దినుసులన్నీ పాళ్లు పాళ్లుగాచేసి, కలిపాడు. అలా తయారైన ఆ దివ్యౌషధాన్ని బాగా సోలెడైతే తను సేవించాడు. ఆమందు ప్రభావం ఏమిటో మరి — కడుపులోకి ఆమందు అట్లా పోయిందోలేదో, యీయన యిట్లా నిద్రకుపడ్డాడు. ఆ పడుకోవటం పడుకోవటం, బాగా ఐదు, ఆరు గంటలసేపు గొడ్డునిద్ర పోయాడు.

నిద్ర లేచేసరికి మాత్రం, మనిషి బాగా తేరుకొన్నాడు. మొఖం అదీ మంచి కళగా కనిపించింది. ఎప్పుడైతే తాను తయారుచేసిన యీ దివ్యౌషధం తన కింత బాగా పనిచేసిందని ఋజువు అయిందో, అప్పుడే, బాగా ఒకగాలను మందు తీసి, శాంకో పాంజానోట్లో కూడా పోసేశాడు. వాడుకూడా యీ

మందు మంచిదేనన్న అభిప్రాయంలో వున్నాడేమో, 'కిం' అనకుండా అంతమందూ గుటకలో మింగేశాడు.

అదేం ఖర్మమో, ఏమో—ఆమందు వీడికి వికటించింది. మందు పుచ్చుకోక ముందువున్న కాస్త ఓపికా కూడా ఎక్కడికి పోయిందో---గంటలతరబడి మనిషి అసలు లేవలేకపోయాడు. తెగమూలుగుతూ పక్కమీదే పడివున్నాడు.

వాడు ఆ వరసను మూలుగుతూ వుంటే, డాన్ క్విక్ సెట్ తన పక్కమీద లేచి కూర్చొని, వీరులు మాత్రమే సేవించవలసిన యీ 'దివ్య వీరౌషధాన్ని' యీబంటుగాడు సేవించినందువల్లనే కొంప యింత మునిగిందని తెగదెప్పటం మొదలుపెట్టాడు. అంతే కాదు---యికముందు ఎప్పుడైనా వీరులు సేవించే ఔషధాల వూసుఎత్తితే,వీడి తల వెయ్యి ముక్కలుగా బద్దలై పోతుందని భయపెట్టాడు.

శాంకో పాంజా లేవలేని స్థితిలో వున్నందువల్ల, డాన్ క్విక్ సెట్ తానేపోయి 'రోజినాన్ టీ'కి జీనూ అదీ తగిలించాడు ఆచేత్తోనే తనబంటు తాలూకు వాహనం 'డాపుల్'ను కూడా సరిజేసి ప్రయాణానికి సిద్ధంగా అట్టేపెట్టేడు ఆపశువుల పని చూస్తూవుండగా, ఆగోడ్ల చావిడిలో తుప్పుపట్టివున్న శూలం ఒకటి యీయన కంటబడింది. మొన్న ఆగాలి మరలలో యిరుక్కొని విరిగిపోయినప్పటినుంచీ తనకు సరైన యీటె అమరనే లేదు. అందుకని కంటికి అగుపించిన యీ శూలాన్ని జాగ్రత్త చేశాడు.

ఈలోగా శాంకోపాంజా కొంచెం తేరుకొన్నాడు. గాడిద నెక్కే ఓపిక వచ్చింది. ప్రయాణానికి అన్నీ సిద్ధంగా వున్నాయి. మిగిలిన పని అల్లా ఆ హోటల్ యజమాని (---కాదు కాదు---కోట గవర్నరు)గారి వద్ద శెలవు తీసుకోవటమే ఆపనికూడా పూర్తిచేసి పొద్దు వాటారకముందే పోవచ్చుకదా అని, డాన్ క్విక్ సెట్ తానే పెద్ద సంరంభంతో ఆహోటల్ యజమాని (కాదు కాదు---కోట గవర్నరు) గారి వద్దకుపో-యి--

"ఖ్యాతి వహించిన మీ యీ కోటలో, మేము యీ రెండు దినములుగా మీవల్ల పొందిన పలు సత్కారములకు మే మాజన్మాంతము మీకు ఋణపడి యున్నాము. ఈ క్షణము మొదలుకొని ఎప్పుడు కానీ, ఎక్కడ కానీ, ఎవడు కానీ-దుండగీడు మిమ్ములను అవమానించినవో---మాకు కాకిచే కబురంపుడు. శిష్టరక్షణము దుష్టశిక్షణమే వ్రతముగాగల నేను ఎందున్ననూ, రెక్కలు గట్టుకొని యిటవచ్చి వాలి, మీపట్ల చెడుగా ప్రవర్తించిన ఆ పోగరబోతుల గుండెలను చీల్చి చెండాడెదను." అంటూ ధీరోదాత్తంగా వుపన్యసించాడు. ఈ వుపన్యాసంతో ఆ హోటల్ యజమాని(కాదుకాదు---కోటగవర్నరు) గారు సంతృప్తుడై తనను ఆశీర్వదించి పంపుతాడని ఆశించాడు.

కానీ ఆ హోటల్ యజమాని యీ పప్పులన్నీ తనదగ్గర వుడకవు పొమ్మన్నాడు. అంతగా తల తిరుగుతున్నవాడు ఎవడైనా తనను తూలనాడటమే సంభవిస్తే, యీ వీరుడికి కబురుచేసి యీయనను

వాడిమీదికి వుసికొల్పనక్కరలేకుండానే వాడి కేవిధంగా సమాధానం చెప్పాలో తనకు తెలుసు లెమ్మన్నాడు.

తనకు యిల్లాంటి పోచికోలు కబుర్లతో పని లేదని చెప్పివేసి,యీ రెండు రోజులూ తన హోటల్‌లో పడి తెగమేసినందుకు, డబ్బు కక్కి, మరీ కదలమని హుంకరించాడు.

ఆయన అంత కరాఖండిగా డబ్బు కక్కమంటేనే కానీ, డాన్ క్విక్‌సెట్ గారికి యిది తానను కొన్నట్లు కోటకాదని తెలియలేదు. "ఏమేమీ; యిది కోటకాదా? ఆహార పానీయములను విక్రయించు భోజనశాలయా? ఈవిషయము నేనింత దనుక ఎరుగకయుంటినే! ఏమాశ్చర్యము; ఏమాశ్చర్యము !! ప్చ...ప్చ...ప్చ జరిగిన పొరపాటున కిప్పుడు ఎంత విచారించిమాత్రము ప్రయోజనమేమున్నది. అయ్యా! ఓ భోజనవిక్రేతా! నే జెప్పునది సావధానచిత్తుడవై ఆలకింపుము. నేను వీరుల వర్గమునకు జెందినవాడను ఇతఃపూర్వము వీరుడైనవాడెవ్వడునూ, ఆహార పానీయాదులకు డబ్బు చెల్లించినట్లు నే జదివిన ఏ పుస్తకమునందును కానరాదు. అట్టివో, నేను మాత్రము నీకు ఎట్లు చెల్లించగలను?" అంటూ కళ్లు పెద్దవిచేసి, చేతులు తిప్పుకొంటూ వీధి నాటకాల ధోరణిలో అభినయం మొదలు పెట్టాడు.

అంతటితో ఆహోటల్ యజమానికి వళ్ళు మండుకు వచ్చింది. "ఇక నీ వాగుడు కట్టిపెట్టి, నాకు న్యాయంగా రావలసిన పైకాన్ని చెల్లించి, మరీ కదులు. నీ వీరులు, వీరసత్కారాలతో నాకు ఏమీ పనిలేదు. వాటినిగూర్చి తెలుసుకోవలసిన అవసరం కూడా నాకులేదు. నాకు కావలసిందల్లా---డబ్బు!" అని గద్దించాడు.

వీరులవర్గంపట్ల యింత అవమానకరంగా ప్రవర్తిస్తున్న ఆ హోటల్ యజమానిమీద డాన్ క్విక్‌సెట్ గారికి పరమ అసహ్యం వేసింది. "ఛీ! నీవింత మందబుద్ధివేమి! నీ బ్రతుకు యింత హేయమేమి?" అంటూ ఆయనపై ఛీత్కరించుకొని థుప్పున నేలమీద వుమ్మివేసి, గుర్రం డొక్కలలో ఒకతాపు తన్నాడు ఈసారి కూడా ఎందుకనో 'రోజినాన్‌టీ' ఒక్కసారి అదిలిస్తేనే పరుగు లంకించుకొంది. పది మార్లు దాన్ని బ్రతిమాలవలసిన అవసరం లేకుండానే తన గుర్రం, అదిలించటమే ఆలస్యంగా పరుగు లంకించుకొంటే డాన్ క్విక్‌సెట్‌కు బలే హుషారు పుట్టుకొచ్చింది. చేతిలోవున్న యీటెతో చెడీ తిప్పుకొంటూ దూరంగా స్వారీ చేశాడు.

వీడికి యిన్ని వుపచారాలు చేసి, ఒకటికి, రెండురోజులు కూర్చోపెట్టి మేపితే, చివరకు వీడు పైసాఅయినా యివ్వకపోగా, మొఖంమీద వుమ్మివేసినంత పనిచేసి వుడాయించినందుకు యీ హోటల్ యజమానికి వల్లమాలిన కోపం వచ్చేసింది. తప్పించుకుపోయినవాడు ఎల్లానూ పోయినాడు కదా అనీ, యింకా అక్కడే జోగుతూవున్న బంటు శాంకోపాంజాగాడి భరతం ట్టటానికి వూనుకొన్నాడు. వాడి రెక్కలు పెడవిరిచి పట్టుకొని, మాటా మంతీ లేకుండా ముందు వీపుమీద మోచేత్తోనూ, పిడికిలితోనూ కుమ్మినంతసేపు కుమ్మాడు.

ఆ హోటల్‌లో బసచేసివున్న మరి కొంత మంది కూడా యీ చప్పుళ్లు విని, సంగతేమిటో అని బిలబిలా బయటకు వచ్చారు వెర్రిబాగులవాడి నొకడిని హోటల్‌యజమాని పట్టుకు చితక పొడుస్తూవుంటే, వీళ్లకూ వాడిపని పట్టాలని సరదా పుట్టింది. ఆ పదిమందీ పోగై, శాంకోపాంజా మీద కసితీరేదాక గుద్దుల వర్షం కురిపించారు. వాళ్ల కాళ్లు నొప్పులు పుట్టేదాకా తన్నారు అప్పటికీ సరదా తీరక, ఒక పెద్ద గొంగళి తెచ్చి, దాంట్లో వీణ్ణి వుండగా చుట్టి, కాసేపు ఫుట్‌బాల్‌ని తన్నినట్లు ఆకాశంలోకి ఎగురతన్నారు. గొంగళి చుట్టలోనుంచి, తాపు తాపుకీ వీడు గోలపెట్టి అరుస్తుంటే వాళ్లంతా పకపకా నవ్వులాటలు సాగించారు. వీడు ఎంత బిగ్గరగా గోల పెట్టితే, వాళ్ల కంత యిదిగా వున్నది. అల్లా ఎంతోసేపు వాడితో బంతి ఆటలు ఆడి, చివరకు వాళ్లకే విసుగుపుట్టాక, వాడి సంచిలోనుంచీ ఒక పెద్ద దుప్పటిని బయటకు తీసి, దాంతోనే వీణ్ణి ఒకటే ముద్దగా కట్టివేసి, ఆ ముద్దను తీసుకువచ్చి 'డాపుల్' మూపున కుదేశారు. అక్కడికీ సరదా తీరక, వాళ్లల్లో ఒకడు ఆ గాడిద తోకకు సీనారేకు డబ్బా ఒకటి కట్టి గాడిదను ఒక్క తన్ను తన్నాడు.

ఆ గాడిద పెద్దగా ఓండ్ర పెట్టుకొంటూ

గంతులు వేసింది. గాడిద వేసిన ప్రతిగంతుకూ దానితోకకు కట్టిన డబ్బా కూడా నేలమీదనుంచీ ఎగిరెగిరిపడుతూ పెద్దగా చప్పుడు చేసుంటే, ఆ చప్పుడుకు హడిలిపోయి, యీ గాడిద యింకా బిగ్గరగా ఓండ్రపెట్టుతూ యింకా ఎక్కువఎత్తు ఎగురుతూపోయింది. గాడిదవేసే ప్రతి గంతుకీ, వుండగా చుట్టబడ్డ శాంకోపాంజా ఎగిరెగిరిపడ్డాడు.

అలా ఎంతసేపు ఆ గాడిద తన్నుకొంటూ, తన్నుకొంటూ పరిగెత్తిందోకానీ, కొంతదూరం పోయాక గాడిదతోకకు కట్టిన సీనారేకుడబ్బా ఎక్కడో వూడి పడిపోయింది. ఆ చప్పుడు ఆగిపోయాక అరగంటకు గాడిద ప్రాణం కుదటపడ్డది. గాడిద గంతులు మానివేసిన గంటకు శాంకోపాంజా ఎగిరెగిరిపడటం మానేశాడు.

డాన్ క్విక్ సెట్ ఎప్పుడో అనగా హోటల్‌లో నుంచి తప్పించుకు బయటపడినా, శాంకోపాంజాకు ఏమి ముప్పు వస్తుందోనన్న భయంకొద్దీ, ఆ చుట్టుపట్లనే తారట్లాడాడు. ఈలోగా ఆహోటల్‌లో వాళ్లు శాంకోపాంజాకు దేహశుద్ధిచేసి, గాడిదమీదకు దేసి, బయటకు తోలటం, ఆ గాడిద దారీ డొంకా చూసుకోకుండా తెగ గెంతుతూ అడ్డదిడ్డంగా పరిగెత్తటం, యిదంతా చూస్తూనే వున్నాడు. ఆగాడిదను ఎలాగైనా పట్టుకొని, శాంకోపాంజాగాడి చెవులైనా యింత మూసి ప్రాణాలు కాపాడుదామంటే ఆగాడిద ఎందునా అందకుండా పరుగులెత్తింది ఆ సీనారేకు డబ్బా వూడిపోయి గాడిద కొంచెం తేరుకొన్నాక కానీ, డాన్ క్విక్ సెట్‌గారు గుర్రం ఎక్కికూడా దాన్ని కలుసుకోలేక పోయాడు.

శాంకోపాంజాను గాజుసీసాను దించినంత భద్రంగా గాడిద వీపుమీదనుంచీ దించి, వాడిచుట్టూ చుట్టబడివున్న బట్టల దట్టింపునంతా ఒలిచి, వాడికి యిన్ని మంచినీళ్లు పట్టి, గొంతు అదీ సవిరించి, సంగతేమిటని ప్రశ్నించాడు. వాడు తనకు జరిగిన శృంగభంగమంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. అనుకోకుండా ఆహోటల్‌ను విడిచివచ్చి వెయ్యటంలో, చిల్లరా మల్లరా దాచి వుంచుకొన్న సంచి కాస్తా అక్కడే వుండిపోయిందన్న వార్త చల్లగా బయట పెట్టాడు.

శాంకోపాంజా, డాన్ క్విక్ సెట్ యిద్దరూ, అల్లా ఒకరికొకరు ఎదురు బొదురుగా చెట్లకు జేరగిలబడి కూర్చొని, వంతుల ప్రకారం వేడినిట్టూర్పులు విడిచారు.

(ఇంకావుంది)

# చంద్రలోకంలో విహారం

ప్రసూనా, సూరిగాడూ బయట మంచంమీద వెన్నెట్లో పడుకొన్నారు. 'ప్రసూనక్క' సూరిగాణ్ణి తన మంచంమీదనుంచి లేచిపొమ్మని బెదిరించింది. వాడు లేవనంటూ పట్టుపట్టాడు. ప్రసూనకు కోపంవచ్చింది. "లేరా! నా మంచంమీదనుంచి" అంటూ తమ్ముణ్ణి ఒక్క మొట్టికాయ మొట్టింది. వాడు తలపట్టుకొని ఏడవటం మొదలుపెట్టాడు.

అంతలో వాళ్ల అమ్మమ్మ, యింట్లోనించి బయటకువస్తూ, "ఎందుకురా బాబూ! ఏడుస్తున్నావు?'' అంది. "ప్రసూనక్క కొట్టిందమ్మమ్మా!'' అన్నాడు సూరిగాడు ఏడుస్తూ. వాడిమాట పూర్తికాకమునుపే "లేదమ్మమ్మా! వాడు నా మంచంమీదనుంచి లెమ్మంటే లేవటంలేదు!'' అని సంజాయిషీ యిచ్చింది ప్రసూన.

''పోనియ్యిలేరా సూరి! నీవు నా మంచంమీద పడుకుందువుగానిలే, రా!'' అంది అమ్మమ్మ. సూరిగాడు మొకం పెద్దదిచేసుకొని ''భలే! అమ్మమ్మ నాకు ఎంచక్కా మంచిమంచి కథలు చెబుతుందిగా! నీవు నాదగ్గరకొచ్చావంటే ఏంచేస్తానో చూడు!'' అంటూ అమ్మమ్మ ప్రక్కమీద కెళ్లాడు.

ప్రసూన తన మంచంమీద విశాలంగా పడుకొని ''నువ్వు రమ్మన్నావచ్చేదెవరు పో'' అంది.

సూరిగాడు అమ్మమ్మప్రక్కలో పడుకొని దీక్షగా ఆకాశంవంక చూస్తున్నాడు. చటుక్కున వాడికేదో సందేహం కలిగింది.

''అమ్మమ్మా! చంద్రుడిలో ఏముంటుంది?''

''చంద్రలోకం ఉంటుందిరా బాబూ!''

''అంటే?'' అన్నాడు తనకేమీ అర్థంకానట్టు.

అమ్మమ్మ చెప్పటం మొదలుపెట్టింది: ''అంటే! అందులో చంద్రుడి రాజ్యముంటుందన్నమాట! దానికి రాజు చందమామే! ఆలోకం ఎంచక్కా ఉంటుందనుకున్నావు? భలేగా ఉంటుందిలే!''

''అయితే! అమ్మమ్మా అక్కడకు ఎవరయినా వెళ్లవచ్చా!'' అన్నాడు ఎంతో ఆసక్తితో సూరి.

''ఊమ్మో! ఎవరూ వెళ్లలేరు నాయినా!''

సూరిగాడికి యింకో సందేహం కలిగింది, ''అమ్మమ్మా! చంద్రుణ్ణి అందరూ 'మామా' అంటారెందుకు?''

''చందమామకి అందరూ ఆడసంతానమేరా నాయనా. మనకు కనపడే నక్షత్రాలన్నీ ఆయనకూతుళ్లే! ఆ లోకంలో మగవాళ్లెవళ్లూ లేరు. అందుకనీ తన కూతుళ్లను భూలోకంలో మగవాళ్లకి యిస్తానంటూ ఉంటాడు! కానీ యిక్కణ్ణుంచి ఎవరెళ్లి చేసుకుంటారు? యిక్కడే మనకు బోలెడంత కట్నాలతో కూడా పిల్లలు వస్తుంటే!?''

''అయితే! అమ్మమ్మా నాకూడా ఓ అమ్మాయిని యిస్తాడా? పెళ్లిచేసుకుంటాను''

అమ్మమ్మ నవ్వి "ఆ! ఎందుకివ్వడు నాయనా? నీకేం! మహారాజాలా ఉన్నావు!'' అంటూ సూరిగాడికేసి చూచింది అమ్మమ్మ.

వాడేదో ఆలోచనల్లోపడ్డాడు. ఆ ఆలోచనల సందడిలో కనురెప్పలు మూశాడు.

''హారి భడవా! యిప్పుడే మాట్లాడి, అప్పుడే నిద్రపోయావట్రా?'' అంటూ అమ్మమ్మకూడా మాట్లాడకుండా నిద్రపోయింది.

* * *

సూరిగాడు అమాంతంగా లేచి ఆకాశంలోకి ఎగిరిపోతున్నాడు

ఆకాశంలో రంగు, రంగుల మబ్బుల లోనుంచి వెళ్లిపోతున్నాడు! అక్కడక్కడా మబ్బులో బంగారు తీగలా మెరిసే మెరుపులు ఎంతో రమ్యంగా కనిపించాయి సూరిగాడు అవన్నీ దాటుకుంటూ చందమామ లోకంలో ప్రవేశించాడు.

అదే చంద్రలోకం !! చంద్ర లోకంలో చల్లటిగాలి తగిలే టప్పటికి సూరిగాడికి కలలోనే మెలకువ వచ్చింది "అరెరె! ఇదేమిటి? ఇక్కడికి కొచ్చాను? ఇది ఏం లోకం ?" అని కంగారు పడుతూ కళ్లు నలుపుకొని చూచాడు ఎక్కడ చూచినా బంగారుమేడలు, ఎంతో మెరిసిపోతున్నాయి ! దీపం లేకుండా నే ఆలోకంలో వెలుతురు ఎంతో కాంతిగా ఉంది ! చక్కని ఉద్యాన వనాలు, సరస్సులు కన్నుల పండువుగా కనుపిస్తున్నాయి

"అరె! మగవాళ్లెవళ్లూ కనుపించటంలేదేం ? అందరూ ఆడవాళ్లే!'' అని సూరి గాబరా పడుతూ ముందుకు నడుస్తున్నాడు. కొంచం దూరంలో బంగారుకోట ధగధగా మెరసిపోతున్నది. అటు వైపుకు నడిచాడు. అంతలో యిద్దరు ఆడభటులు సూరిగాడి చేతులు రెండూ పట్టుకొని "ఏయ్! ఎవరు నువ్వు?'' అని అడిగారు. మొదట హడలిపోయాడు సూరిగాడు. కాని గడుసువాడవటంచేత ధైర్యం తెచ్చుకొని "ఇది ఏ ఊరు ?'' అని అడిగాడు.

"ఊరేమిటోయ్ పిచ్చివాడా ! ఇది చంద్రలోకం !''

సూరిగాడి కళ్లు తిరిగిపోయాయి!

(47-వ పేజీ చూడండి)



# అదృష్టం వుండొద్దూ?

(24-వ పేజీ తరువాయి)

ఊరికి వెళ్తున్నప్పుడే వాళ్ల నాన్నగారు అన్నారు—"జాగర్త నాయనా, పజిల్స్‌లో పడిపోయి చదువు మానేశేవ్!"

'లేదునాన్నా' అన్నాడే కాని ఆ పిచ్చిలో పడకుండా వుండటం అతని తరమైందికాదు.

తనకి వచ్చిన నాల్గురూపాయిలు వరసగా నాలుగుమార్లు కట్టాడు. వరసగా 8, 6, 6, 5 తప్పులు వచ్చాయి. ఆశమాత్రం తగ్గ లేదు. నెలనెలా తనకి వస్తున్న నల భైలోను యిరవైఅయిదు హోటలు వాడికి, ఐదురూపాయిలు జీతంపోను, మిగిలినది పైఖర్చు చేస్తూవుండే వాడు. ఇప్పుడు పైఖర్చు తగ్గించి రూపాయి మిగిల్చి పజిల్ పంపనా రంభించేడు. క్రమేపి మిగల్చడం దుస్సాధ్యం అయిపోగా, నాన్న గార్కి దొంగవుత్తరాలు వ్రాసి, డబ్బు రాబట్టి కట్టేవాడు. కాని ప్రతిసారి ప్రైజు రాకండా తన్నే సేది

ఎలాగయితేనేం- యీ సంగతి వాళ్ళ నాన్నగార్కి తెలిసింది. వెంటనే లాడ్జికి వచ్చారు. మేము బడినుంచి వచ్చేసరికి వీధిగుమ్మంలో బెంచిమీద కూర్చున్న రామనా థంగారిని చూచి అదరిపడ్డాం.

"మావాడేడీ" అన్నారు ఆయన కొంచెం కటువుగా.

"వెనకాల వస్తున్నాడండీ" అని నేను సణిగాను.

"మావాడెలా చదువుతు న్నాడు?" అన్నారు

"బాగానే చదువుతున్నాడండీ"

"నీకేమాత్రం వొచ్చిందేమిటి లాటరీలో" అన్నారు సీరియస్‌గా మొఖంపెట్టి.

నేను ఒక్కసారి గతుక్కుమ న్నాను—జబాబు ఏమిటా అని ఆలోచిస్తూ. ఇదంతా కనిపెడుతూ వున్న రామనాథంగారు "ఎందు కలా అదరిపడతావ్? నీకేం రాలా లాటరీలో? నువ్వెంత తగలేశావ్? మీరసలు యిక్కడికి వచ్చింది దేనికి? మేం ఎలా సొమ్ముపంపిస్తు న్నామో మీకేమైనా తెలుసా? మరేం పనిలేనట్టు లాటరీలు ఆడు తున్నారా! వాడు రానీ చెప్తాను" అన్నారు కోపంగా. నా ప్రాణాలు పైకి పోయాయి. నేనేం కట్టలేదని చెపుదామనుకున్నాను కాని, నోట మాట పెగల్లేదు. పుస్తకాలు లోపల పడేసి వస్తానని జారుకున్నాను.

అదేపరుగున రామారావుదగ్గ రికి పోయి జరిగిన సంగతి చెవులకబో శాను, వొక్క గుక్కలో. వాడు నిలువెల్ల కంపించిపోయాడు. ఈ రోజున దెబ్బలు తప్పవని మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ పిల్లిలా లాడ్జికి వచ్చాడు. వచ్చీ రావడంతోనే "ఏరా? ఎక్కడకు వెళ్లావు? ఇంతసేపువరకు ఏంచేస్తు న్నావ్?" అని రామనాథంగారు కొడుకిని గదమాయించారు

"ఏంలేదు నాన్నా యిక్క..."

"చాల్—నోరుముయ్! నాకం తా తెలుసు. పుస్తకాలు కట్టేసి యింటికి పద. చాలు యీచదువు. నలుగోక్లాస్ మాస్టర్‌గా నీకు రిక మెండ్ చేయిస్తాను. నీకు శ్రమ; నాకు డబ్బుదండగ ఎందుకు? నువ్వు బాగుపడే రకంకాదు అని మొదటే అనుకున్నా." ఆయనకు కోపం ఎక్కువైనకొద్దీ ఆయాసం వచ్చింది. మాటలు తడబడ పడుతు న్నాయి.

"నీ తోటివాళ్ళందరు ఎలాచదు వుతున్నారో చూడు. నీకు ఒక్కడి కేనా డబ్బుఆశ? మాకు లేదేం? నిన్ను ఈవూరు ఏ పరిస్థితులలో ఎలా పంపేమో, నువ్వు యీవూరు ఎందుకు వొచ్చావో నీకు తెలుసా? నీకసలు యీ లాటరీ బుద్ధెందుకు పుట్టిందీ? అబద్ధపు వుత్త రాలు రాసి, మాదగ్గర సొమ్ము పీడి స్తావా పుండాకోర్."

కొంచెంసేపు వూరుకున్నారు. కొంచెం ఆయాసం తగ్గాక, మళ్ళీ యిలా అన్నారు.

"మొన్న అయిన స్లిప్ టెస్టు లలో ఎలావొచ్చాయి మార్కులు?"

(జాయిన్ అవగానే నెల్లాళ్ళకి స్లిప్ టెస్టులు పెడతారులెండి)

"ఇంగ్లీషు 38, తెలుగు 41, లెక్కలు..."

"ఏరా ఎన్నొచ్చాయి చెప్ప వేం" అన్నారు గుడ్లురుమి.

"లెక్కలు 24, సైన్సు 51, సో షల్ స్టడీస్ 64."

"ఏంరా? లెక్కలలో యిన్ని తక్కువేమిటి? నువ్వు సరిగా చదవ లేదన్నమాట. హాఫ్ఇయర్లీ పరీక్ష లలో అన్నిటిలోను 50కి తక్కువ వచ్చాయంటే చూస్కో ఏం చే స్తానో. ఈమాటు మళ్ళీ లాటరీ వూసుఎత్తావంటే జాగ్రత్త."

అప్పటికి రాత్రి 8 గంటల

యింది. ఆయన ఆరాత్రిబండికే వెళ్తాను అంటూ చటుక్కున లేచి వెళ్లిపోయారు.

"మేం మొదటనుంచీ చెప్తే విన్నావురా? నీనుంచి మాకు కూడా చీవాట్లుపడ్డాయికదా! యిప్పుడు యీమాటు మరెత్తకు." అని మేం సముదాయించాం.

అప్పటినుండి రామారావు లాటరీ కట్టలేదు. కాని ఒకసారి మాత్రం పజిల్ తెచ్చి నింపాడు. "మళ్ళీ ఏమిట్రా యిది" అని అడిగాను.

"ఏం లేదురా. ఎన్ని తప్పులొస్తాయో చూద్దామని దాచానురా" అన్నాడు. "అయితే మాచేతికియ్, మేం దాస్తాం" అన్నాం. అలాగే నాచేతి కిచ్చాడు. మేం దాచాం.

కీసొల్యూషన్ వచ్చింది. మావాడిది "ఆల్ కరెక్టు". అది చూచి మావాడు చాలా విచారించాడు. "యిది పంపివుంటే ఎంత బాగుండునురా! మానాన్నకి యీలోగా తెలియకుండావుంటే నాకు ఎంత సొమ్ము వచ్చివుండునురా!! అయినా యింతకీ అదృష్టముండొద్దూ! నాకు ధనరేఖలేదు, అంతే!" అన్నాడు విచారంగా.

ఇంతసేపటినుంచి నాకు నవ్వాగలేదు. "విచారించకురా, రామం. నేను నాపేరన పంపానులే" అన్నాను.

వాడు మొదట నమ్మలేదుకాని తర్వాత ప్రయిజు లిస్టులో ఆల్ కరెక్ట్ లిస్టులో రమణపేరు వుండటం చూచి అమితానందం పొందాడు. "అయితే నావాటా ఎంత?" అన్నాడు. నలుగురం సమానంగా పంచేసుకుందాం అన్నాను. అందరం వొప్పుకున్నాం. నాకు వచ్చిన వాటాని మానాయనగార్కి పంపి వేశాను. రామంకూడా తన వాటా డబ్బును వాళ్ల నాన్నగారికి పంపుతూ, జాబు వ్రాశాడు. రామనాథంగారు మనియార్డరు అందుకొని వుత్తరం చదివారు. అది యిలా వుంది.

ప్రియమైన నాన్నగార్కి అనేక నమస్కారములు చేసి వ్రాయునదేమనగా—

నేను మీకు పంపిన సొమ్ము నాకు లాటరీలో వచ్చినది. నేను మీరు వొద్దన్న దగ్గరనుంచీ మరి కట్టలేదు కానీ, పజిల్ నింపి ఒకసారి రమణ చేతికి వుంచమనియిస్తే, వాడు తన పేరన పంపాడు. మాకు వచ్చిన డబ్బును 4 వాటాలుచేసి నలుగురం తీసుకొన్నాము. నావాటా మీకు పంపుతున్నాను. పెద్దలకు నమస్కారములు, పిన్నలకు ముద్దులు. యిచ్చట అంతా క్షేమం. మీ క్షేమం వ్రాయగోరుతాను.

చిత్తగించవలెను
మీ ప్రియపుత్రుడు
పి. రామారావు.

ఈ వుత్తరం అందుకొని రామనాథంగారు డబ్బు వచ్చినందుకు ఒక వంక సంతోషిస్తూనే, రామం మళ్ళీ పజిల్ జోలికి పోయినందుకు పిసరంత విచారించారు.

ఇక్కడ మా లాడ్జిలో రామం నన్ను అడిగాడు: "ఒరే! రమణా! నన్ను పజిల్సు కట్టవద్దని మానాన్నగారికంటె ఎక్కువగా నాకు బుద్ధి చెప్పి, నువ్వు ఎందుకు కట్టావురా?"

"ఒరే అబ్బాయి! నీ పేరిట పంపితే ప్రైజు రాకపోగా, నీకూ, నీతోపాటు వున్న మాకు చివాట్లు వచ్చాయి. దాంతో నీదెంత శనిజాతకమో తేలిపోయింది మరి నాపేర కట్టితే ఎట్లా కలిసివస్తుందో చూద్దామని బుద్ధిపుట్టింది. గుట్టు చప్పుడు కాకుండా నువ్వు వేసిన పజిల్ నాపేరపంపి వూరుకొన్నా. నువ్వు అంతకష్టపడి పజిల్ పూర్తిచేసి పంపినా నీకు రాకపోవటమేం? నేను ఎంతమాత్రం కష్టపడకుండా నువ్వు పూర్తిచేసిన పజిల్ నాపేర పంపుకొంటే ఫస్టుప్రైజు రావటమేం? దేనికైనా అదృష్టం వుండాలిరా అబ్బాయి! అదిలేనిరోజున నీచేతిలో బంగారం కూడా మట్టి అయిపోతుందనుకో!"

అదృష్టంమీద చిన్న వుపన్యాసం దంచేశాను.






(గతసంచిక తరువాయి)

"అవునా; సుందరం! గెలీలియో పెండ్యులం కనిపెట్టాడని చెప్పానా! కానీ- యీయన కనిపెట్టిన పెండ్యులంను గడియారాలకు తగిలించి పనిచేయించిన గౌరవం యీయనకు కాకుండా, క్రిస్టియన్ హ్యూజెన్స్ అనే మరొకడికి దక్కింది" అని చెప్పి గడియారం ఒక క్షణంసేపు ఆగింది.

సుందరం అడిగాడు : "పెండ్యులం కనిపెట్టినవాడు గెలీలియో అయితే, దాన్ని గడియారంలోకి అమర్చిన గౌరవం మరొకరికి ఎలా పోయింది ?"

"అదేనోయ్ విచిత్రం ! మీ తాత నాటిన మామిడి విత్తనాలు యిప్పటికి కదా చెట్లై, పూలుపూసి, కాయలు కాస్తున్నదీ? విత్తనాలు వెయ్యటం వంతు మీ తాతదైతే, పళ్లు పీక్కుతినేవంతు నీది అవటమేం?"

"అంటే?"

"అంటే - ఏనాడో ఎవరో పడ్డ శ్రమ మరేనాడో మరెవరికో అక్కరకు వస్తూవుండటం సర్వేసర్వత్రా సంభవం. పెండ్యులం విషయంలో పరిశోధనలైతే గెలీలియోయే చేశాడు కానీ,తన పరిశోధనల ఫలితాన్ని ఏదైనా ఒక ప్రయోజనానికి వినియోగించే అవకాశం లభించేలోగానే, మతబోధకుల మూర్ఖత్వానికి బలిఅయిపోయాడు. గెలీలియో జీవితం అలా అంతమైపోయినా, ఎల్లప్పుడూ ఒకే ప్రమాణంలో కాలాన్ని కొలిచే సాధనం కోసం ప్రజలు పడే యాతనలు మాత్రం తప్పిపోలేదు. అందుకని గెలీలియో తదనంతరం హ్యూజెన్స్ మరికొన్ని పరిశోధనలు చేసి గెలీలియో కనిపెట్టిన పెండ్యులాన్ని గడియారానికి తగిలించేడు."

"అది సరే - ఆ పెండ్యులం ఎప్పుడూ 'టిక్కు', 'టిక్కు' మంటూ వుంటుంది కదా? దానికి అర్థమేమిటి ?"

"అంటే "చుప్...చుప్" అన్న మాట."

"చుప్ అంటే?"

"చుప్ అంటే తెలియదూ ? 'నిశ్శబ్దంగా వుండు' అనటానికి హిందీలో 'చుప్' అంటారు. ఇప్పుడు స్కూళ్లో హిందీ కూడా చెప్పుతున్నట్లున్నారు. ఇంత చిన్న మాటకు అర్థం మరిచిపోతే ఎట్లా?"

"మా యింట్లో వుండే గడియారం మా అందరితోపాటే తెలుగు మాట్లాడుతుం దనుకొంటాను కానీ, రాజభాష మాట్లాడి రాజసం వెలగబెడుతుం దనుకొంటానా ఏమిటి?"

గడియారానికి నవ్వు వచ్చింది.

"అది కాదోయ్! సుందరం ! పోనీ ఆ గడియారం 'పట్' 'పట్' అని యింగ్లీషులో అంటే బాగుంటుందంటావా ?"

"నిక్షేపంలా వుంటుంది."

"పోనీలే! యింగ్లీషుస్థానే హిందీ రాజభాషగా వెలిసినప్పటినుంచీ గడియారం యింగ్లీషు మానేసి యిప్పుడు హిందీలో 'చుప్...చుప్' అంటున్నదనుకో. సరేనా!"

"అదికాదు కానీ- అసలు ప్రతివాళ్లనూ నోరు ముయ్యమని చెప్పే అధికారం యీ గడియారాలకు ఎవరు యిచ్చారు?"

"అది కాదోయ్! మీ యింట్లో ఒక పెద్దమనిషి వున్నాడనుకో. పిల్లలందరూ ఒకటే వరసను అల్లరి చేస్తూ, 'గీ' 'బా'మంటూ అరుస్తూ

వుంటే, ఆ పెద్దమనిషి మిమ్మల్నందరినీ అరవద్దని కేకలు వెయ్యడూ! అల్లాగే గడియారాలుకూడా చిన్నపిల్లలను అరవ వద్దని ఎప్పుడూ హెచ్చరికలు చేస్తుంటాయిలే."

"ఓహో!" అన్నాడు సుందరం, వెటకారంగా మొఖం పెట్టి.

"అలా సరిపెట్టుకుపోవాలిగానీ, అయినదానికీ కానిదానికీ పేచీ పెట్టుంటే ఎట్లా చెప్పు? రాత్రి అనక, పగలనక క్షణమైనా విశ్రాంతి తీసుకోకుండా మీకోసం కాలాన్ని కొలుస్తూవుండే గడియారం, కాస్త పెద్దమనిషిధోరణిలో 'అల్లరి చెయ్యకు నాయనా' అని హెచ్చరిస్తే అంత కంటగించుకొంటే ఎల్లాగోయ్; సుందరం?"

"మీజాతివాళ్ళను సమర్థించుకోవటం చాలుగానీ..."

"అసలుకథ చెప్పమంటావ్! అంతేనా? చెప్పుతున్నా. విను. పెండ్యులాన్ని గడియారానికి తగిలించి దానిచేత పని చేయించుకోవటం, ఆ హ్యూగెన్స్ పుణ్యమా అని, మీ మనుష్యులకు తెలిసిపోయాక, యిక చూసుకో, ప్రపంచంలో ఎన్నో గడియారాలు వెలిశాయి! ఒక్కొక్క యింట్లో ఒక్కొక్క గడియారం అట్టే పెట్టుకోవటం అంటే, ఎవరికైనా అర్థమౌతుంది. ఒక్కొక్క యింట్లో ఎన్ని గోడలు వుంటే అన్ని గోడగడియారాలు, గోడలోనే గడియారాలు పెట్టించుకోవటం మొదలుపెట్టారు. ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు గోడనీ, గోడకువున్న గడియారాన్ని కూడా పట్టుకుపోవటం కుదరదు కనుక, చేతిగడియారాలు చేయించుకొని, మనిషికి ఒక్కొక్కటిచొప్పున తగిలించుకొన్నారు. ఈ చేతిగడియారాల్లోకూడా మళ్ళీ ఆడ, మొగ వ్యత్యాసాలు! ఆడగడియారాన్ని మొగవాళ్లు పెట్టుకోరు; మొగ గడియారాన్ని ఆడవాళ్లు పెట్టుకోరు. ఈ మొగ, ఆడ భేదాలు తప్పుతాయి కదా అని ఆశపడ్డ మా గడియారాల్లో కూడా యీ భేదాలు తెచ్చిపెట్టారు మీ మనుష్యులు. ఇక అప్పటినుంచీ మా గడియారాల్లో సంఘీభావం అన్నది లేకుండాపోయింది. ప్రతి గడియారమూ, తన యిష్టంవచ్చినట్లుపోవటం నేర్చుకొన్నది. ఏ రెండు గడియారాలూ ఒక్కమాదిరిగా నడవలేకపోతున్నాయంటే నమ్మ! మా బ్రతుకు ఇంత చౌకబారు బ్రతుకైంది." గడియారం కొంచెంసేపు వూపిరి పీల్చుకోవటానికి ఆగింది.

"మీ బ్రతుకు ఒక్కటే చౌక కాలేదులే! రేడియోల బ్రతుకు మాత్రం ఏమంత ప్రియంగా ఏడ్చిందీ?"

మీకంటే దౌర్భాగ్యపుస్థితిలో యీ రేడియోలు వున్నాయని చెప్పితే గడియారానికి పట్టిన క్లేశం కొంత కాకపోతే కొంత అయినా తగ్గుతుందని సుందరం ఆశపడ్డాడు.

"అవును. నువ్వు అన్నదీ నిజమే! వెనకటి రోజుల్లో రేడియో అంటే అంత అపరూపంగా వుండేదా? ఇప్పుడు ఏ తాటిపాకమీద చూసినా దాణ్డేలు కట్టినట్లు, రెండు వాసాలు పాతి, వాటికి వొక తీగ తగిలించి పెట్టుతున్నారు. అయినా, మా బ్రతుకు మరీ హీనంతే! రేడి



కిష్టుడు : ఓరోయ్ గోపీ! నేను పరీక్ష ప్యాసయ్యానని మా నాన్న యీ పెన్ కొనిపెట్టారురా!

గోపీ : నేను పరీక్ష ఫేలయ్, సీట్లుకోసం తిప్పలుపడకుండా తప్పించానని మా నాన్న నాకీ ర్యాలీసైకిల్ కొనిపెట్టారురా!

కూలి బ్రతుకు యింకా మా అంతగా బండకు ఎక్కలేదు."

"నిజంగా మీకు బ్రతుకు అంత భారమనిపిస్తే మిమ్మల్ని పుట్టించిన వాళ్లననాలి."

"వాళ్లకేమోయ్: మహారాజులు. ప్రపంచంలో యిన్ని రకాల యంత్రాలు వచ్చాయంటే, మీ మనుష్యుల బ్రతుకుల్లో ఇంత తేలికతనం ఏర్పడిందంటే, ఆ వలన అంతా ఆ యింజనీర్లదే. అది మాత్రం ఒప్పుకోకతప్పదు. అసలు గడియారాలను బాగు చెయ్యటం వృత్తిగా పెట్టుకొన్నవాళ్ళలో నుంచే గొప్ప గొప్ప యింజనీర్లు తయారైనారు."

"గొప్పలు చెప్పుకోకు!"

"గొప్పలు కావు దారం తీసేందుకు మొట్టమొదటి యంత్రం కనిపెట్టిన హేర్‌గ్రీవ్‌స్ వున్నాడే, ఆయన వృత్తి మొదట్లో గడియారాలు బాగుచెయ్యటమే. ఇంగ్లండులో 18 వ శతాబ్దారంభంలో వచ్చిన పారిశ్రామిక విప్లవానికి నాందీవాచకాలు పలికిన మేధావుల్లో యీ హేర్‌గ్రీవ్‌స్ ఒకడు. ఆవిరితో నడచే ఓడను కనిపెట్టిన 'ఫుల్‌టన్' కూడా మొదట్లో గడియారాలు రిపేరు చేసినవాడే! వీళ్లెవ్వరూ యిప్పటి యింజనీర్ల లాగా తెల్లచొక్కాలు తొడుక్కొని కాలేజీల్లో కూర్చొని చదువుకోలేదు. వాళ్ల తండ్రులో, ఆ తండ్రులకు తెలిసిన మిత్రులో ఎవరో ఆయా వృత్తుల్లోవుంటే, వారివద్ద చేరి ఏండ్ల తరబడి కాయకష్టంచేసి, పని నేర్చుకొన్నారు. బుర్ర వుపయోగించి సరిక్రొత్త విషయాలు కనిపెట్టారు. ఈ రోజుల్లో మీరంతా విమానాల్లో ఎగురుతున్నా, రైళ్లలో ప్రయాణంచేస్తున్నా, గదిలోనే కూర్చొని దూరాన పాడిన పాటలు వింటున్నా, తెరమీది బొమ్మలు వేసే చిందులు చూసినా, వీటి కన్నిటికీ కారణభూతులైనవారు ఆ రోజున అర్ధాకలితో చెమటోడ్చి పనిచేసినవారే!" (ఇంకావుంది)

# విజ్ఞానవీధులు

"డాక్టర్"





## 18. గ్రహాలంటె ఏవి?

మన పూర్వులు సూర్యుడూ, చంద్రుడూ, అంగారకుడూ, బుధుడూ, గురుడూ, శుక్రుడూ, శనీ, రాహువూ, కేతువూ అనే తొమ్మిదింటినీ (నవ) గ్రహాలన్నారు. ఇవన్నీ భూమిచుట్టూ తిరుగుతున్నట్లే కనిపిస్తాయి. కనక భూమిచుట్టూ తిరిగేదే గ్రహమని పూర్వుల అభిప్రాయమన్న మాట. బుధగ్రహము సూర్యుడికి చేరువగా వుంది. కనక సూర్యుడు ఉదయించక ముందుగాని, సూర్యుడస్తమించిన తర్వాతగాని కొన్ని రోజులలో చూడవచ్చును. గ్రహాలు నక్షత్రాల లాగ మినుకు మినుకు మనక కళాయి పోయిన అద్దాల లాగు ఒకే కాంతితో కనపడతాయి. శుక్రుణ్ణి మనము (వేగు) 'చుక్క' అంటాము. కొన్ని మాసాల్లో తెల్లవారు కట్ల తూర్పునా, మరికొన్ని మాసాల్లో సూర్యాస్తమయానికి తర్వాత పశ్చిమానా కనపడతాడు శుక్రుడు. గురుడు శుక్రుని కంటె కాంతి తక్కువగా తెల్లగానే వుంటాడు. అయితే నడిరాత్రికి కూడా వచ్చి, సూర్యచంద్ర పథములో సంతటా ప్రయాణిస్తాడు. అంగారకుడు ఆరుద్రలాగ ఎర్రవాటుగా కనబడతాడు. శని తెల్లగావున్నా చిన్నదిగా కనపడే గ్రహము. రాహు కేతువులు వస్తు గ్రహాలు కావు. ఛాయా గ్రహాలు; కంటికి కనబడవు.

కనక సూర్యచంద్రులూ మరో అయిదూ, మొత్తము ఏడు గ్రహాలన్నమాట. ఈ గ్రహాలన్నీ నక్షత్ర ఖచిత నీలాకాశంలో ప్రయాణిస్తూ భూమిచుట్టూ తిరుగుతూన్నట్లే కనపడినా, ఆ అయిదూ మాత్రము కొన్నాళ్లు వెనక్కి మళ్లి వక్రగతి ఉన్నట్టు కనపడతాయి. ప్రపంచ సిద్ధాంతులందరికీ గ్రహాల వక్రగతి విప్పరాని సమస్య అయిపోయింది. భారతీయ సిద్ధాంతులు ఏదో మహా ప్రవాహము అంతరాళంలో సాగి పోతూన్నదనీ గ్రహాలు ఆ ప్రవాహంలో పడ్డప్పుడు వెనక్కి కొట్టుకు పోతున్నాయనీ నమ్మేరు.

పదహారో శతాబ్దములో కోపర్నికస్ అనే పోలెండు సిద్ధాంతి గ్రహాలన్నీ భూమిచుట్టూ కాక సూర్యుని చుట్టూ తిరుగుతున్నాయనీ, మన భూమికూడా సూర్యుని చుట్టూ తిరుగుతూండడము వల్ల, మనకు కనపడే గ్రహగతులన్నీ భూభ్రమణమూ, గ్రహభ్రమణమూ అనే రెండు గతుల సంయోగ పరిణామ గతులనీ చక్కగా వివరించాడు.

భూమి తిరుగుతున్న దనడము బైబిలు వాక్యాలకి వ్యతిరేక మాట వల్ల ఈ సిద్ధాంతము బాహాటముగా పైకి రాలేక రాలేక చివరికి గెలీలియో (1564-1642) బోధనలలో వ్యాప్తి పొందింది. కెప్లరు (1571-1630) గ్రహముల భగణము (దారు)లను గురించి మూడు సూత్రాలు కనిపెట్టాడు. వీటిని ఆధారము చేసుకుని న్యూటను (1642-1727) రెండు వస్తువుల నడుమ గురుత్వాకర్షణమనే ఆకర్షణ ముందుటుందనే సత్యాన్ని కనిపెట్టాడు. కోపర్నికసుతో మొదలు పెట్టిన సూర్యమధ్యస్థ సిద్ధాంతము న్యూటను నాటికి చక్కగా కుదురుకున్నది. భూమికూడా ఒక గ్రహమైంది. సూర్యుడి హోదా హెచ్చింది. చంద్రుడు భూమికి ఉపగ్రహమైనాడు. గ్రహాలు ఆరైనవి.

హెర్షెల్ అనే ఆంగ్ల సిద్ధాంతి యురేనస్ అనే 'వరుణ గ్రహాన్ని'

(4౮-వ పేజీ చూడండి)



తన పరదేశికోసం ఎదురుచూస్తోందా ఈ అభిసారిక ? అంజలీ 'పిక్చర్సు' వారి

**"పరదేశి"లో అభినేత్రి అంజలి.**



స్కూలుకిపోవటానికి వీల్లేకుండా సుశీలసమర్తాడి మూలకూర్చుంది. తను పెద్దమనిషైనా అన్న చదివిస్తానన్నాడుగదా అని

ఆమెధైర్యం — రాజా ప్రొడక్షన్సువారి "పుట్టిల్లు"లో కొత్తనటి జమున.

# ★ సినిమా నటన ★

సినిమా చిత్రాలలో నటనకీ నాటకాలలో నటనకీ భేదమున్న సంగతి సామాన్యంగా అందరికీ తెలిసినదే నాటకాలలో నటించటం అలవాటయినవారు సినిమాలలోను, సినిమాలలో నటన అలవాటయినవారు నాటకాలలోను రాణించలేక పోవటం కూడా తెలిసినదే. కాని రెంటిలోనూ సమానప్రతిభ చూపేవారిని కూడా చాలామందిని మన మెరుగుదుము. ఇంగ్లండులో సర్ రాల్ఫ్ రిచర్డ్‌సన్, సర్ లారెన్స్ ఒలీవియర్, మనదేశంలో పృథ్వీరాజ్ ఉభయరంగాల్లోనూ విశేషగౌరవం సంపాదించినవారే కాని పృథ్వీరాజును అడిగితే తనకు సినిమాలలో నటించటం కన్న నాటకాలలో నటించడమే ఎక్కువ ఇష్టమని చెబుతాడు

'ఫిల్మ్‌ఫేర్' పత్రికలో పృథ్వీరాజ్ నాటకానికి సినిమాకు గల భేదాలుగూర్చి రాస్తూ "సృజనాత్మకమైన కళగా నాటకం సినిమా చిత్రాలకన్నా ఎన్నో రెట్లు గొప్పది." అనీ, "ఇతర లలితకళలవలెనే నాటక కళను కూడా వ్యాపారంగా పరిగణించటానికి వీల్లేదు కళాకారుడు(ఇక్కడ నటుడు) తన వ్యక్తిత్వప్రకటనకు ఉపయోగించే సాధనాలలో నాటకరంగస్థలం ఒకటి" అనీ రాశాడు

కళగా నాటకం సినిమాకన్నా గొప్పదని అనటంలో పృథ్వీరాజ్ నటుని దృక్పథం నుంచి మాత్రమే మాట్లాడుతున్నాడు. నటుని దృష్ట్యా నాటకం నిజంగా సినిమాకన్నా గొప్పది నటుడు తన నటనాప్రతిభను సంపూర్ణంగా ప్రదర్శించటానికి నాటకరంగం ఇచ్చినంత అవకాశం సినిమా ఎన్నటికీ ఇవ్వలేదు. స్టేజిమీదికి ప్రవేశించి నటించే నటుడు అసహాయ శూరుడిలాంటివాడు. అతని సమర్థతగాని, అసమర్థతగాని నిమిషాలమీద అక్కడే తేలిపోతుంది అతడు పొరపాటు చేస్తే అతడుగాని మరొకరుగ్గాని దాన్ని సవరించలేరు. అంటే అతని నటనకు అతడు తప్ప ఇంకెవరూ బాధ్యులు కారన్నమాట. సినిమాచిత్రంలో పరిస్థితి ఇందుకు పూర్తిగా భిన్నమైనది.

స్టేజినటుడు ప్రతి నిమిషమూ తన కెదురుగా, దూరంగా ప్రేక్షకులు కూర్చున్నారనే విషయం జ్ఞాపకముంచుకుని నటించాలి తన ప్రతిమాట, ప్రతి అవయవ చాలనం, ముఖకవళిక ప్రేక్షకులకు విని

స్తున్నదా, కనిపిస్తున్నదా, అర్థవంతంగా స్ఫురిస్తున్నదా, లేదా అని చూసుకోవాలి కోపం ప్రదర్శించవలసివస్తే కనుబొమలు ముడిచినంతమాత్రాన చాలదు కోప తీవ్రతనుబట్టి దానికి తగినంత ఆర్భాటం చెయ్యాలి; ఘాటైన మాటల్లో ఆ కోపం వ్యక్తం చెయ్యాలి. అందువల్లనే నాటక రంగంమీద నటించటానికి ఎంతైనా అవకాశం ఉంటుంది అదే సినిమాచిత్రంలో అయితే కోపప్రదర్శనకు ముఖంలో ఎంత చిన్న కవళికను చూపెంచినాసరే సినీ కెమేరా దాన్ని ఇట్టే పట్టివెయ్యగలదు నాటకమందిరంలో స్టేజి కెదురుగా ప్రేక్షకు లుంటారు స్టుడియో ఫ్లోర్‌లో నటుని కెదురుగా ప్రేక్షకు లుండరు ప్రేక్షకుల స్థానాన్ని కెమేరా భర్తీచేస్తుంది కాని నాటకప్రేక్షకులు ఒకేచోట కూర్చుని నాటకం చూస్తారు. కెమేరా దగ్గిరినించి, దూరంనుంచి, అన్నివైపులనుంచి నటుని నటనను చూస్తుంది అందుచేత సగం నటనకు బాధ్యత కెమేరాయే వహించ గలుగుతున్నది.

నాటకరంగస్థలానికి, స్టుడియో రంగస్థలానికి ఇలాటి భేదా లుండటంచేత నాటకంలో నటునికి సినిమాలో నటునికంటె ఎక్కువ ప్రాధాన్య మున్నది కనుకనే పృథ్వీరాజులాగ రెండురంగాల్లోనూ అనుభవమున్న నటులు నాటకరంగాన్నే వరిస్తారు.

అయితే విచిత్ర మేమంటే ఈనాడు నాటక నటీనటులు కలలో కూడా ఆశించనంతటి కీర్తి ప్రఖ్యాతులు సినిమానటీనటులు ఆర్జించగలుగుతున్నారు ముఖ్యంగా మన దేశంలో ప్రేక్షకులు మంచిచిత్రం చూసి ఆనందించినప్పుడు యావత్తు గౌరవమూ నటీనటులకే ఆపాదిస్తారు చిత్రం బాగుండటానికి ముఖ్యకారణం నటీనటులే అని విశ్వసిస్తారు కాని చిత్రం గొప్పదనానికి నటీనటుల కెంత బాధ్యత ఉన్నదో అంతకంటె ఎక్కువ బాధ్యత తెరవెనుక కనిపించనివారికి కూడా ఉంటుంది

సోవియెట్ చిత్రనిర్మాత, పుడోవ్కిన్ కొన్నేళ్లకిందట ఫిలింటెక్నిక్‌ను సిద్ధాంతీకరిస్తూ ఒక పుస్తకం రాశాడు. అందులో ఆయన చిత్ర నిర్మాణంలో ముఖ్యపాత్ర వహించేది డైరెక్టరేనని అభిప్రాయపడ్డాడు నటీనటులకు తమ నటనకు సంబంధించినంత వరకూ కొంత బాధ్యతఉన్నా, మొత్తం చిత్రానికంతటికీ బాధ్యుడు డైరెక్టరు కనక అతడే ముఖ్యకళాకారుడు అని పుడోవ్కిన్ అంటాడు మట్టితో ప్రతిమలు తయారుచేసే శిల్పి మట్టిని ముడిపదార్థంగా మాత్రమే పరిగణిస్తాడు. అలాగే డైరెక్టరు నటీనటుల నటనను ముడిపదార్థంగా మాత్రమే పరిగణిస్తాడు (మంచిమట్టి తెచ్చుకోవటం శిల్పి తెలివితేటలమీద ఆధారపడి ఉంటుంది) ఆ ముడిపదార్థంలోంచి కళాఖండాన్ని నిర్మిస్తాడు డైరెక్టరు; అని అభిప్రాయ పడ్డాడు పుడోవ్కిన్.

స్టేజిమీద నటుడు ఆపాదమస్తకం పూర్తిగా ప్రేక్షకులకు కనిపిస్తాడు. సినిమాలో అలా కాదు. ఎంతవరకూ అవసరమో అంతవరకే కెమేరా గ్రహిస్తుంది సినిమా నటుడు కూడా స్టేజినటుడు పడ్డంత శ్రమా పడతాడు కాని అతని నటనలో ఏ భాగ,



తను తెచ్చిన సంబంధం ఇష్టంలేని సుగుణ (సావిత్రి) ను ఒప్పించచూస్తున్నాడు తండ్రి సాంబయ్య (కోడూరి అచ్చయ్య)

పీపుల్స్ఆర్ట్ వారి "పల్లెటూరు"లో



ప్రగతిపిక్చర్స్ తీయబోతున్న "గౌరిలో" ప్రథమదర్శనం ఇవ్వనున్న కొత్తనటి అరుణ.

మీద కేంద్రీకరిస్తే ఎక్కువ ఫలితం కలుగుతుందో ఆ భాగంమీదనే కెమేరా కేంద్రీకరింపబడుతుంది ఉదాహరణకు కోపంగాని, భయంగాని, ఆందోళనగాని చూపించవలసవచ్చినప్పుడు ముఖాన్ని క్లోజప్‌లో తీయవచ్చు లేక వణుకుతున్న చేతివేళ్ళను క్లోజప్ తీసి కోపమో, భయమో చూపవచ్చు ఒక ఇంగ్లీషు చిత్రంలో ఒక పాత్ర మానసికాందోళన చిత్రించవలసి వచ్చింది ఆ నటుడు సందిగ్ధ మనస్కుడిలాగ అటూ ఇటూ తిరుగుతాడు కెమేరా మనిషిని చూపించకుండా అటూ ఇటూ కదిలే అతని నీడను మాత్రమే చూపుతుంది మరొక చిత్రంలో వెళ్లాడుతున్న దీపాని కెదురుగా నటుడు నుంచుంటాడు దీపం అటూ ఇటూ ఊగులాడుతూ అతని ముఖంమీదకు ఒకసారి వెలుగు, ఒకసారి చీకటి ప్రసరింపజేస్తుంది పైన ఉపయోగింపబడిన రెండుపద్ధతులవల్ల పాత్రల ఆందోళన ద్విగుణీకృతంగా వ్యక్తం అవుతుంది. అలాగే ఒక మనిషియొక్క దృఢనిశ్చయాన్ని చూపవలసివచ్చినప్పుడు బిగించిన గుప్పిళ్లు క్లోజప్‌లో చూపస్తే సరిపో

జెమినివారి "ముగ్గురుకొడుకులు' లో కన్నాంబ, మాస్టర్ సేతు.



తుంది ఇవన్నీ సినిమాలోనే సాధ్యపడతాయి. వీటిలో నటుని ప్రజ్ఞకంటే డైరెక్టరు ప్రజ్ఞయే ఎక్కువ కనిపిస్తుంది

సినిమా చిత్రాలలో కెమేరాను ఉపయోగించటం తెలిసినవాడు సాధించలేనిది లేదు. సినిమటోగ్రఫీ అభివృద్ధిచెందుతున్నకొద్దీ చిత్రాల సాయికూడా అభివృద్ధి అవుతుంది; టెక్నిక్ అభివృద్ధిఅయినకొద్దీ దాని సహాయంతో రససృష్టికి మార్గాలు, అవకాశాలు కూడా పెరుగుతాయి

నటుని దృష్ట్యా నాటకం సినిమాకన్నా గొప్పది కావచ్చు. కాని కళగా సినిమానాటకాని కేమీ తీసిపోదు. నాటకంలో నటనటులు కళాకారులైతే సినిమాలో డైరెక్టరు కళాకారుడు. నవలాకారుడికి, కవికి, చిత్రకారుడికి ఇచ్చే గౌరవం ఈరోజుల్లో డైరెక్టరుకు కూడా ఇవ్వవలసిఉంది ★


జగత్ పిక్చర్సువారి "అంబేర్"లో నర్గీస్.

రాజా ప్రొడక్షన్సువారి సాంఘికచిత్రం "పుట్టిల్లు" షూటింగ్ చురుకుగా జరుగుతున్నది ఇప్పటికి మూడురీళ్ళ చిత్రంతీశారు నాయికగా జమున అనే కొత్తఅమ్మాయి నటిస్తున్నది డా॥ రాజారావుగారు కథానాయకుడుగా నటిస్తూ డైరెక్టు చేస్తున్నారు పాటలు, మాటలు సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు వ్రాస్తున్నారు ఎ. పి కోమల పాడిన ఒకలాలిపాట, రాణిపాడిన "చదివిస్తాడే అన్నయ్య" అనే పాట ఇప్పటికి రికార్డు చేయబడినాయి లాలిపాటలో ఎంత చక్కని సాహిత్యం ఉందో అంతచక్కని సంగీతం మ్యూజిక్ డైరెక్టరు మోహనదాసుగారు కూర్చారు బొంబాయి చిత్రాల్లో పనిచేసే వి ఎన్ రెడ్డిగారు ఈచిత్రానికి కెమేరా నిర్వహిస్తున్నారు "పుట్టిల్లు" చిత్రానికి డిస్ట్రిబ్యూటింగ్ హక్కులు జనతావారు తీసుకున్నారని తెలుస్తోంది

* * * *

చాలకాలం ఆగిపోయిన నవయుగవారి "జ్యోతి" షూటింగ్ మళ్ళీ ఇటీవలే ప్రారంభమైంది ఇప్పుడు జ్యోతి తండ్రి రామయ్య 'ఇల్లు' సెట్టుమీద పనిజరుగుతున్నది ఇక తుదివరకూ నిరాఘాటంగానిర్మాణం సాగగలదని తెలుస్తోంది. ఇప్పుడు దర్శకత్వం, ఫొటోగ్రఫీ కూడా శ్రీధర్ గారే నిర్వహిస్తున్నారు. సంగీతం పెండ్యాల, పాటలు మాటలు సుంకర సత్యనారాయణ, ట్రీట్ మెంట్ కొడవటిగంటి కుటుంబరావు; జి వరలక్ష్మి, శ్రీరామమూర్తి, లక్ష్మి పెరుమాళ్లు, సావిత్రి రామచంద్రకాశ్యప, ప్రభాకరరావు మున్నగువారు నటిస్తున్నారు పీపుల్స్ఆర్ట్ వారి "పల్లెటూరు" చిత్రం ముప్పాతిక వరకూ తయారైంది రషెస్ చూసినవారుఈ చిత్రం గ్రామ ప్రజలను బాగా ఆకర్షిస్తుందని భావిస్తున్నారు.

* * * *

భాస్కర్ ప్రొడక్షన్సువారు తీస్తున్న "బ్రతుకు తెరువు"లో నాగేశ్వరరావు, రేలంగి, శ్రీరంజని, సావిత్రి, పేకేటి శివరాం నటిస్తున్నారు రామకృష్ణదర్శకత్వం నిర్వహిస్తున్నారు అరుణావారు తీస్తున్న రెండవచిత్రానికింకా పేరు పెట్టలేదు దీనిలో నాగయ్య, పండరీబాయి, జయమ్మ, సరోజిని, పేకేటి నటిస్తున్నారు కథ ఆత్రేయ; దర్శకత్వం కృ ☞

స్వామి. పేకేటి శివరాం పై రెండు చిత్రాల్లో కాక వినోదా వారి "దేవదాసు", జెమినీవారి 19 వ చిత్రంలోను, జంపన వారి "మేనరికం" లోను నటిస్తున్నాడు.

* * *

ప్రగతి పిక్చర్సువారు తీయబోతున్న "గౌరి" షూటింగ్ వచ్చే నెలలో ప్రారంభమౌతుందని ఆ చిత్రానికి టెక్నికల్ సూపర్ విజన్ నిర్వహిస్తున్న హాస్యనటుడు శివరావుగారు తెలుపుతున్నారు దర్శకుడు అడ్డాల.

* * *

న్యూ థియేటర్సువారి "యాత్రిక్" చిత్రం తెలుగు, తమిళ భాషల్లో కూడా నిర్మింపబడుతున్నది జీవితపరమార్థాన్ని అన్వేషిస్తూ హిమాలయ శిఖరాలకు ప్రయాణం చేసే ఒక జిజ్ఞాసువు అనుభవాలు ఈ చిత్రానికి కథావస్తువు భారత అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్ గారు ఇటీవల ఈ చిత్రాన్ని తమ భవనంలో చూసి గొప్ప చిత్రమని మెచ్చుకున్నారట.

* * *

దేవకీబోసు తీసిన "రత్నదీప్" తమిళ తర్జుమా పూర్తయిందట ఆగస్టులో ఈ చిత్రం దక్షిణాదిన విడుదల అవుతుందట. హిందీ, అరవములలో తీయబడిన మహబూబ్ ప్రొడక్షన్సువారి "ఆన్" టెక్నికలర్ చిత్రం ఈ నెల 18 న లండన్‌లో విడుదల అవుతున్నది ఆగస్టు 1 న భారత దేశంలో విడుదల అవుతుందట నిమ్మి, నదీరా, ప్రేమ్‌నాథ్, దిలీప్‌కుమార్ ముఖ్య నటీనటులు. సంగీతం నౌషద్. లండన్‌లో "ఆన్" విడుదలసమయానికి అభినేత్రి నిమ్మి కూడా హాజరవుతుందట.

* * *

తమిళ ప్రొడ్యూసరు కెంపరాజ్ "కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో" కథను అరవ కన్నడభాషల్లో తీస్తున్నాడట. స్క్రిప్టు వగైరాలు పూర్తయి, ఈ నెలాఖరులోగా వాహినీలో షూటింగ్ ప్రారంభమవుతుందట. సారంగపాణి, సహస్రనామం వగైరాలు నటిస్తారట. లలిత, పద్మిని కూడా బుక్ కావచ్చునట. ★

## పారం

(5-వ పేజీ తరువాయి)

బయటపెత్తాడా సరే సరి. లేదూ? 'ఎప్పుడూ యింతేనేరా? డబ్బులు లేకుండా ఎట్లా వస్తావురా?' అని అడిగేస్తాను అయ్యారుఎదుట గౌరవం పోతుంది 'తర్వాత యిస్తానండి' అని అయ్యారుతో అంటాను. అయ్యారు 'సరే' అంటాడు - నేను నాల్గయిదుసార్లు మా అమ్మ డబ్బులివ్వనప్పుడు తర్వాత అంటే ఊరుకున్నాడుగా! - కృష్ణుడి మొహం మాడిపోతుంది. నాతో వస్తే ఎప్పుడూ యింతేననుకుని బుద్ధి తెచ్చుకుని వర్తిస్తాడు.

తర్వాత రోజు యిరువురం కలిశాం కాఫీకి పోదామన్నాను మా వాడు 'అందుకు సందేహ మేల బాలకా!' అంటూ వచ్చాడు యథాప్రకారం అయ్యారు టేబిల్ దగ్గరకు వెళ్ళాడు పేపరు తెచ్చాడు. చదివాడు. నాకంటే ముందుగా కాఫీ త్రాగాడు వెళ్ళి అరుగుమీద నుంచున్నాడు. వాణ్ణి పిల్చి డబ్బులిమ్మనడమా - ఇంత బ్రతుకూ బ్రతికి అనిపించింది ఇంకొకసారికైనా వాడికి బుద్ధిచెప్పకపోలేను. ఈ సారికి అయ్యారుతో చెప్పిపోదామని లేచి చకచకా చక్కా వచ్చాను అయ్యారు టేబిల్ దగ్గరకు ప్రాణాలు పోతూ 'రేపు-రేపు' అంటూ నసిగాను 'ఏమిటయ్యా ఎప్పుడువచ్చినా రేపు రేపంటావు నీ దగ్గర డబ్బుంటే తిను, లేకుంటే మాను. నాకు ఊరికే వస్తోందనుకుంటున్నావా ఏం?' అంటూ ఏవి టేమిటో చరిగాడు. ఆ ముక్కలు వీధిలో నుంచున్న మా కృష్ణుడువిని 'ఏరా డబ్బులు లేవేరా?' అంటూ పర్సులోంచి అయిదురూపాయల నోటొకటితీసి యిచ్చాడు 'మీరుదానికొరకైన మనిషి సార్. ఎన్నిసార్లు వస్తురో అన్నిసార్లు సింగిల్‌గా వస్తురు, క్యాష్ డౌన్ సేస్తురూ. అద్దివాడికిగౌరవంజా స్తిదాసార్' అంటూ కృష్ణున్ని పొగిడాడు అయ్యారు.

నా వంటిమీద జెట్టులు, తేళ్ళు పాకినట్లైంది. జేబులో డబ్బులుంచుకొని ఒంటరిగా నున్నప్పుడు ఖర్చుపెట్టుకుంటాడా? నల్గురిలో కెళ్ళి వాళ్ళచేత ఖర్చు చేయిస్తాడా? తన గౌరవం పోతుందనుకున్నపుడూ - ప్రాణావసరాల్లోనూ దాన్ని తీసి ఖర్చు చేస్తాడా? వాడికే గుణపాఠం నేర్పదల్చిన నాకు చక్కటిపాఠం నేర్పాడురా అనుకుంటూ మాయింటివైపు ఉడాయించాను. ★

# చంద్రలోకంలో విహారం

(33-వ పేజీ తరువాయి)

"అబ్బ, నేను చంద్రలోకం వచ్చానన్నమాట? పిచ్చి అమ్మమ్మ ఎవరూ వెళ్లలేరని చెప్పిందేం!' అని తనలో అనుకొన్నాడు.

''ఏఊరబ్బాయ్ ? నీది'' అన్నారు ఆడభటులు. సూరిగాడు పెద్దగా నవ్వి ''ఊరేమిటి ? మాది భూలోకమంటుంటేను'' ఇందాకటి వాళ్ల జవాబుకు, ఈ జవాబు బాణంలా తగిలింది.

''ఓ! నువ్వు చాలా గడుగ్గాయిలా ఉన్నావే? మా చంద్ర మహారాజుగారి దగ్గరకు నడు'' అంటూ ఆ ఆడభటులు సూరిగాణ్ణి చందమామ ఉండే సభకు తీసుకుపోయారు.

అబ్బ! ఆసభ వర్ణించటానికి అలవికాదు. ఎక్కడ చూచినా, చక్కని చుక్కల్లాంటి అమ్మాయిలు నృత్యాలు చేస్తున్నారు. ఆ సభలో చందమామ తప్ప తక్కినవాళ్లంతా ఆడవాళ్లే ! మగపురుగు మచ్చుకయినా కనపడటం లేదు. ఓ పెద్ద బంగారుసింహాసనంమీద చందమామ కాబోలు, కూర్చున్నాడు. అబ్బ! ఎంత మెరిసిపోతున్నాడు ? ఆ ప్రక్కన కూర్చున్న ఆ, ఆడమూకంతా ఎవరు ? ఓహో! అమ్మమ్మ చెప్పిన, చందమామ కూతుళ్లు కాబోలు ఎంత చక్కగా ఉన్నారు ! రంగు పట్టుచీరలు కట్టుకొని ఉన్న వాళ్ల తెల్లని దేహాలు చూసేసరికి, యిందాక తాను చూచిన నీలిమబ్బుల్లోని మెరపు తీగెలు జ్ఞాపకానికొచ్చాయి సూరికి.

చందమామ సూరిగాణ్ని చూచి, సంతోషంతో నవ్వి తన ప్రక్కనే కూర్చోపెట్టుకుని, నృత్యాలు, నాటకాలు అన్నీ చూపించాడు.

సభ ముగిసినతరువాత సూరిగాణ్ని, చందమామ తన అంతఃపురంలోకి తీసుకెళ్లాడు. వాళ్లెమ్మట చందమామ కూతుళ్లు కూడా వచ్చారు. ఎంతో మంచి పట్టు పరుపులమీద కూర్చోపెట్టారు సూరిగాణ్ని. ''ఏం ? అబ్బాయి! నువ్వు మా లోకం ఎందు కొచ్చినట్టు?'' అని అడిగాడు. ''ఉ... మి...'' చెప్పలేక, మాటలు మింగాడు సూరిగాడు.

"చెప్పు ? నీకేం భయంలేదు'' అని భుజం తట్టాడు చందమామ.

''మీ అమ్మాయిని పెండ్లి చేసుకుందామని !'' ధైర్యం చేసుకొని రకీమని చెప్పేశాడు సూరి. చందమామకూతుళ్లందరూ వక్కసారిగా తలలు వంచుకొని ఓరచూపుతో సూరిగాడి వంకచూశారు !

''ఓ ! నీకేం అభ్యంతరం లేదు! నీ యిష్టమొచ్చినవాళ్లను తీసుకెళ్లి, పెళ్లి చేసుకో. ఈ మందను పెంచలేక చస్తున్నా !'' అనేసి చందమామ అక్కడనుంచి గబుక్కున వెళ్లిపోయాడు.

ఇక ఆ గదిలో ఉన్న చందమామ కూతుళ్లు, అందరూ వక్క-

పారిగా వచ్చి సూరిగాడి చుట్టూ మూగి "నన్ను మీ భూలోకం తీసుకెళ్ళమంటే, నన్ను మీ భూలోకం తీసుకెళ్ళమని" సూరి గాణ్ని పీక్కు తినటం మొదలుపెట్టారు. "ఓ! మీ అందరిని తీసుకెళతాను కానీ మీ లోకంలో యింకేమైనా వింతలుంటే చూపెట్టరూ?" అన్నాడు సూరిగాడు.

అందరూ వక్కసారిగా "ఓ! మాతో రా!" అని సూరిగాణ్ని ఓ మంచి ఉద్యానవనంలోకి తీసుకెళ్లారు. ఆ ఉద్యానవనం ఎంతో చక్కగా ఉన్నది. రకరకాల పువ్వులనుంచి వచ్చే సువాసనలు సూరిగాడికి మత్తెక్కించేశాయి. ఆ వుద్యానవనంలో ఓ మంచి కొలను ఉన్నది. అబ్బ! ఆ నీళ్లన్నీ బంగారు నీళ్లే! ఆ కొలనులో ఎఱుపు, పసుపు, నీలం, తెలుపు యిలా ఎన్నో రంగురంగుల తామర పువ్వులు, హంసలు ఉన్నాయి. హంసలు అటూ, యిటూ ఈదుతుంటే ఎంత చక్కగా వున్నదీ!

చంద్రుడి కూతుళ్లు సూరిగాణ్ణి ఆ కొలను గట్టుమీద కూర్చోబెట్టి "ఇప్పుడు మేము నీకు మంచి తమాషా చూపిస్తాం చూడమని" వక్కసారిగా అందరూ మాయమైపోయి, ఆ కొలనులో తేలే తామర పువ్వులమీద వాలేరు! ఆ దృశ్యం భలే రమ్యంగా ఉందిలే. ఏ రంగు పువ్వుమీద ఉన్నవాళ్లు, ఆ రంగు సిల్కుబట్టలనే ధరించి నృత్యం చెయ్యటం మొదలుపెట్టారు. ఉల్లిపొరలాంటి రంగురంగుల చీరెలు గాలికి రెపరెప కొట్టుకుంటూ మంచి ధ్వనిచేస్తున్నాయి. ప్రతీ అమ్మాయి చేతిలోనూ సితారా కిన్నెర, వీణ, మొదలయిన వాయిద్యాలు ఉన్నాయి. వాటిని వాయిస్తూ ఎంతో రమ్యంగా, ఆ తామర పువ్వులమీద నృత్యం చేస్తున్నారు.

సూరి యిక వంటరిగా ఆ కొలను గట్టుమీద కూర్చోలేకపోయాడు. తానూకూడా కొలనులోకి దూకాడు. చేతితో ఓ మంచి సితారా, పట్టుకొని వాయిస్తూ పువ్వుమీద నిల్చొని నృత్యం చేస్తున్నాడు.

అందరు జోరుగా నృతం చేసేస్తున్నారు. సూరిగాడు కూడా మంచి జోరుగా అడుగు వేస్తున్నాడు అలా వెయ్యటంలో సూరిగాడి అడుగు పువ్వుమీదనుంచి జారింది. గుభాలున కొలనులో పడిపోయాడు సూరి. ఆ అగాధంలోకి యింకా యింకా అడుక్కు మునిగిపోతున్నాడు. ఊపిరి ఆడటంలేదు. కాళ్లు చేతులూ కొట్టుకుంటున్నాడు. ఆ కొట్టుకోవటంలో చేతులు "రక్"మని మంచానికి తగిలాయి

"అబ్బా!" అంటూ మంచం మీదనుంచి లేచి కూర్చున్నాడు. "ఓస్! యిదంతా కలేనా! నిజం కాదన్నమాట" అంటూ చందమామవంక జాలిగా చూచాడు. చందమామ "మా అమ్మాయిలను తెచ్చుకోలేదేం?" అన్నట్లు పక్కున నవ్వాడు. ★

## విజ్ఞాన వీధులు

(31 వ పేజీ తరువాయి)

దూర దర్శనితో వెతికి కనిపెట్టాడు. ఈ గ్రహము గతి ఒకొక్కచోట శీఘ్రముగా, మరికొన్ని చోట్ల తప్పు దారిలోనూ ఉన్నట్టు తేలింది. యేడమ్సూ, లెవరీయర్ అను ఇద్దరు గణితశాస్త్రజ్ఞులీ వక్రతకు మనకి తెలియని ఇంకో గ్రహము కారణమై యుండాలని, న్యూటను గురుత్వాకర్షణ సూత్రాన్ని బట్టి, లెక్కగట్టేరు. వారి లెక్కకి తగినట్లే నెప్ట్యూన్ అనే ఇంద్రగ్రహము కొత్తది కనిపెట్టారు బెర్లిన్ వేధశాలలో. లవెల్ అనే వైజ్ఞానికుడు ఈ లెక్కల్ని ఇంకా తఱచి ఇంద్రగ్రహమున కవ్వల మరో గ్రహమున్నదని అంచనావేసి దానిని ఫొటోగ్రాఫులో పట్టేడు

బుధుడూ, శుక్రుడూ, భూమి, అంగారకుడూ, గురుడూ, శని-వరుణుడూ, ఇంద్రుడూ, ప్లూటో అని తొమ్మిది గ్రహాలు తేలేయి. ఇవికాక అంగారకునికీ, గురిడికీ నడుమ చిన్ని గ్రహాలెన్నో కనబడ్డాయి ఫొటోలో. ఈ ఫొటోలు తీసే కెమేరా భూభ్రమణానికి అనుగుణంగా తానూ తిరుగుతుంది. అందువల్ల నైజగతిలేని నక్షత్రాలు చుక్కల్లాగా గతివున్న గ్రహాలు గీతలలాగా ఫొటోలో దిగుతాయి.

అయిదు గ్రహాల్ని మించిన విజ్ఞానము భారతీయ సిద్ధాంతులకు అందలేదు. నేడు తిరిగి ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతీ సంపర్కము ఏర్పడినా, వారికి నాలుగో శతాబ్దపు భారతీయ జ్ఞానాన్ని మించిన జ్ఞానము సయించుటలేదు.

ఇటీవల కొందరు భారతీయ జ్యోతిష్కులు ఈ 'పాశ్చాత్య' విజ్ఞానాన్ని ఉపయోగించి, ఇంద్ర వరుణగ్రహాల ప్రభావాన్ని నిరూపిస్తున్నారు. వీరి 'వెఱ్ఱి' మన సిద్ధాంతులకు అంటుకుంటే బాగుండును,

Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras



పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



కొంగ అందుకు సమ్మ
తించగా మన ఎండ్రి
మెల్లగా మెడకాయ
నొడిసి పట్టింది



తన డెక్కలతొ నొక్కి
కొంగ కంఠము నెండ్రి
కత్తిరించింది



అని చెప్పి
జంబుకము
కాకి కొక
మంచి సల
హాను యిచ్చింది

అప్పుడా కాకమ్మ
పోయిపోగుక రాజ
నగరమ్ము చేరిండి



రాజపుత్రిక జల - క్రీడలాడగ బోతు
నగలన్ని తీసి ఆ- ఒడ్డునే పెట్టింది



వాటిలో నొక రత్న
హారమ్ము గ్రహియించె



చెలికత్తె, లిది చూచి
రాజభటులకు చెప్ప
వారు కాకని వెంబ
డించ సాగారు



మెల్లమెల్లన పోయి
తన చెట్టు దరిజేరి



పుట్టలో హారమ్ము
పడ వేసె నా కాకి



రత్నహారము కొరకు - పుట్టత్రవ్వి భటులు
బుస్సుబుస్సున వెలికి - త్రాచు రాగా భటులు
గునపాలతో కుమ్మి - చంపివేశారు!



శత్రువీరీతిగా
విరగడై పోవగా
పిల్లజెల్లల తోడ
హాయిగా కాపురము
చేసె కాకుల జంట



దమనకుడు
"కనుకనో కరటకా!
బుద్ధికంటెను వేరు
బలమున్నదా?"



"పూర్వమొక కుందేలు - మృగరాజునిట్లులే
మడియించె గాదా?"



Regd. No. M 4479

